# ఉత్తరాలు

## కథలు

"ఎంత చిన్నస్టేషను అయినప్పటికీ స్టేషనుమాస్టర్లకి క్వార్టర్సు ఇస్తారు. ఇది పచ్చి నిజం!" శ్రీమతి అన్నపూర్ణా రంగయ్యగారి పై వాక్యం, పచ్చి అబద్ధంఅనడానికి బోలెడు స్టేషన్లు నిదర్శనంగా వున్నాయి.

యర్రంశెట్టి శాయి (సికిందరాబాదు)

* * *

డి. కామేశ్వరిగారి "పడగనీడ" కథ చదివేసు చక్కటి కథావస్తువు చక్కగా చిత్రించేరు రచయిత్రిగారు వారికి నాఅభినందనలు.

బేగమ్‌అలిరియా అన్సారి (టిట్లాగర్)

* * *

"యాద్" కథ చదివాము. కథ మాకు ఎంతో నచ్చినది. రచయిత డి. హనుమంతరావుగారికి మా అభివందనములు. ఇటువంటికథలు ఇంకా ఆంధ్ర సచిత్ర వారపత్రికద్వారా అందజేస్తారని ఆశిస్తూ, ఎదురుచూస్తున్నాము.

కథలో ముఖ్యంగా 29 వ పేజీ రెండవ కాలములో వ్రాసిన "మేం ఇంకా దొంగ వ్యాపారముల జేసి లక్షలు గడించాలి. మేం ఇంకా లంచాలు పుచ్చుకొని మేడలు కట్టాలి. మేంఇంకా నీతి నిజాయితీలు గిట్టుపెట్టి సన్మానాలు సత్కారాలుపొందాలి మేం యింకా యింకా మిగతావాళ్లకు గోతులు త్రవ్వి మా పదవులు నిలబెట్టుకోవాలి....." అని వ్రాసిన పేరగ్రాఫు నాకు చాల నచ్చినది.

ఎం. రమణారావు, పి. ఎస్. నాయుడు (కలకత్తా)

## సీరియల్

17—6—66 తేదీపత్రికలో కె. శ్యాం రావుగారి ఉత్తరము చూశాను. వేణు గోపాల రావుని డాక్టరుగా అంజనేయులు ఎలాతెలుసుకో గలిగాడు అని వారడిగారు. అవుత్తరము వేణుతనలెటర్ హెడ్ మీద వ్రాసివుండవచ్చుకదా.

బి. సుధాకర్ (హైదరాబాదు)

* * *

తెళ్ళిపల్లివారి 'నిరుద్యోగపర్వం' లగమంటూ ఆపింది. చేసేదిలేక మొదలు పెట్టాను చదవడం. చివరనున్న 'ఇంకా వుంది' అనేది ఇప్పుడే ఉంటే బాగుండు ననిపించింది. రచన చదువుతున్నంతసేపు నవ్వడం ఒక సమస్యే అయింది. చాల సహజంగాఉన్న ఇటువంటి రచనలే పత్రికకు ఎప్పుడూ కొత్తదనాన్ని ఇస్తాయి.

సి. కామేశ్వరరావు (గుంటూరు)

* * *

'నిరీక్షణ" చాలా బాగున్నది. రచించిన రచయిత్రికి మా ధన్యవాదములు. కాని ఒక విషయముమటుకు అంతబాగాలేదు. వేణు, రాధ చాలా తెలివయినవారు అలాంటి వారు క్షణికోద్రేకానికి లోనుకావటము బాగా లేదు. వేణుపాత్ర చాలా బాగున్నది. ఒక వితంతువును వివాహమాడడానికి సమ్మతించటం అతని సహృదయమునకు నిదర్శనము. ఇది కాక రాధమీద ఎన్ని అపవాదులు విన్నా అతను మనసు మార్చుకోలేదు. నిజమయిన స్నేహమంటే రాధా పార్వతులది..

కే. కమలజ (పూరుగావ్)

## వ్యాసాలు

జి. పద్మలతగారు శ్రీ వి. ఎ. కె. రంగారావుగారు మనచిత్రాలను విమర్శించుతూ శ్రీమతి భానుమతి 'నగుమోము గనలేని' అను త్యాగరాజకృతిని 'వివాహబంధం', చిత్రంలో అశాస్త్రీయముగా పాడినదని వ్రాశారు. ఇదిఎంతమాత్రమూసత్యముగాదు. 'నగుమోముగనలేని' వంటికృతులను సినిమా రికార్డుమూలముగా వినిపించుటయే కష్టతరము. సర్వజనరంజకముగా పాడుటయన్న అదిసామాన్యమగువిషయం గాదు. శ్రీమతి భానుమతీ రామకృష్ణ సర్వజనులను రంజింపజేయు రీతిలో పాడుటకు యత్నించిన దేగాని అశాస్త్రీయముగా పాడినదనుట అర్థరహితముగానున్నది. ఆ కృతినిఅంతకంటె రికార్డుమూలముగా శాస్త్రీయముగాపాడుట యసంభవము. అవకాశమున్నను యుపయోగించుకొననిచో విమర్శార్హముగానీ, అవకాశములేనప్పుడు ఇక విమర్శకు తావేలేదుగదా! శ్రీవి. ఎ. కె. రంగారావుగారి సమర్థన సమంజసముగనే యున్నది. కాని రంగారావుగారిని రంధ్రాన్వేషకులంటూ, తామేరంధ్రాన్వేషణకు పూనుకొన్నారు పద్మలతగారు.

బత్తినేని జగదీష్ (కాకినాడ)

* * *

రెడ్డప్పనాయుడుగారివ్యాసం, వారు బహుమతి పందుకున్న చిత్రం చూసాము. వారి వ్యాసానికి, చిత్రానికి ఎక్కడా సంబంధం కనపడదు. "సింహం, సర్పంతోనున్న దేవి" అంటే ఏమి అర్థమే కాలేదు మాతో చాలమందికి. చిత్రకారులు ఆ చిత్రంయొక్క అర్థాన్ని వివరిస్తే కృతజ్ఞులం.

టి. గోపాలరావు (కోయంబత్తూరు)

* * *

డా॥ నళినీమోహన్‌గారు వ్రాసిన విజ్ఞానాత్మకమైన వ్యాసాన్ని చదివి ఆనందించాను. అత్యాధునికమైన ఈ విషయాన్ని గురించి, సులభమైన భాషలో అంత వివులంగా చర్చించిన రచయితను అభినందించే కుండావుండలేకపోతున్నాను.

కంప్యూటర్ భాషను గురించి చర్చిస్తూ నళినీమోహన్‌గారు, బైనరీ సంకేత భాష యొక్క ఆవశ్యకతను చక్కగా వర్ణించారు. మనం వాడుకునే సంఖ్యలు బైనరీ భాషలో ఎలా వుంటాయో చూపించారు. కానీ 3433 అన్న సంఖ్యను 110 10 110 1001 అని ఎలా వ్రాయగలిగారన్న సందేహం మా స్నేహితుల్లో చాలామందికి కలిగింది. ఇలాంటి సందేహమే చాలామంది ఔత్సాహిక పాఠకులకు కూడా కలిగివుంటుందనడంలో సందేహంలేదు.

వినోదాత్మకమైన కార్టూనులు వేసిన సాంబుకు ధన్యవాదాలు.

ఎస్. ఎస్. జయరామమూర్తి,
ఇంజనీరింగు విద్యార్థి (కాకినాడ)

• జవాబు వచ్చేవారం ★

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం 22—7—'66

పరాభవనామ సం॥ అధిక శ్రావణ మాసం శు॥ పంచమి

సంపుటము : 58 సంచిక . 47

స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1

క్రొత్తరేట్ల ననుసరించి 14—1—1966 మొదలు ఆంధ్రసచిత్ర వారపత్రిక చందా వివరాలు.

భారతదేశం

| | పోస్టుద్వారా రూ. పై. |
| --- | --- |
| సంవత్సర చందా | 19.25 |
| 6 మాసముల చందా | 9.62 |
| 3 మాసముల చందా | 4.80 |

ఇతర దేశాలకు
ఓడమీద (Sea Mail)

| | |
| --- | --- |
| సంవత్సర చందా | 32.00 |
| అర్ధసంవత్సర చందా | 16.00 |


# మన లో మాట

మధ్యపేజీలలో ద్రావిడ మున్నేట్ర కజగం, దాని చరిత్ర పరిశీలించే నాలుగు వ్యాసాలలో మొదటిది. వ్యాసాలలో రచయిత శ్రీ మోహన్‌రామ్ వెలిబుచ్చిన అభిప్రాయాలతో మేము ఏకీభవించ నవసరంలేదు! ఈ వ్యాసాలు 'మెయిన్ స్ట్రీమ్' పత్రిక అనుమతితో ప్రకటిస్తున్నాము..

* * *

'ముద్దమందార' నవల ఈవారం అయిపోయింది. పైవారం ప్రారంభం అయ్యే సీరియల్‌కి సంబంధించిన ప్రకటన ఇదే పేజీలో చూడవచ్చు...

* * *

స్థలాభావంచేత ఈ సంచికలో 'మౌల్వీనసీరుద్దీన్ కథలు' వేసే అవకాశం లేకపోయింది !

* * *

కథలు, వ్యాసాలు మొదలయినవి పంపేవారికి మా కార్యాలయంలో పాటించే నిబంధనలని వివరించే ప్రకటనలు ఎన్నో వేస్తూనే ఉన్నాము కాని కొందరు వాటిని గమనించకుండా ఉత్తరప్రత్యుత్తరాలు జరుపటానికి ప్రయత్నిస్తూనే ఉన్నారు! ప్రచురణకి స్వీకరింపని కథలతోబాటు రచయిత స్వంత చిరునామాకల కవరు (తగినన్ని తపాలా బిళ్లలు అతికించినది), ఉంటేనే తిప్పి పంపటం జరుగుతుంది. వేరుగా అటువంటి కవరు పంపినా తిప్పిపంపటం వీలు కాదు, ఎటువంటి ఉత్తరప్రత్యుత్తరాలూ వీలుపడవు. రచయితలకి ప్రచురణకి స్వీకరించని పక్షంలో ఆ సంగతి తెలుపుతూ ఒక కార్డు పంపుతాము. నవలలు పంపేవారు వ్రాతప్రతితో స్వంత చిరునామాతోబాటు తగినన్ని తపాలా బిళ్లలు కల కవరు పంపనవసరంలేదు. ఉత్తరాల శీర్షికకి పంపే రచనలు ఏ సందర్భంలోనూ తిప్పిపంపబడవు. ..



# విషయానుక్రమణిక

ముఖచిత్రం : నటి కాంచన (ఫోటో: ప్రభాకర్)


పరిస్థితి విషమించక ముందే మనం జాగ్రత్త పడాలి
ప్రపంచం


ఇండోచైనా సంక్షోభం


ఎక్కువ ఉత్పత్తి సమస్య
చిన్న కారు


కావాల్సిన మేరకు కత్తిరింపు
ఇండోనేషియాలో కొత్త ఆదేశం
సుకర్నో


పోనువ్వేమైతే నాకేం!
పాకిస్తాన్ కాబినెట్ నుంచి భుట్టో పతనం
పాకిస్తాన్ కాబినెట్

శ్రీకృష్ణ

# విద్యాపరిశీలన సంఘం రిపోర్టు: రాష్ట్రాల కర్తవ్యం

విద్యా పరిశీలనసంఘంవారి రిపోర్టు ఇటీవలే పత్రికలకి వెలువరించారు. ఇది చాలా పెద్ద 'పత్రం.' భారతదేశంలో విద్యాభ్యాసానికి సంబంధించిన ప్రతి విషయాన్నీ పరిశీలిస్తుంది. దానిలోని సూచనలనిగనుక అమలుపరిస్తే ఈదేశంలో విద్యాభ్యాస పద్ధతుల స్వరూపమే మారిపోతుంది. అయితే దీనిని అమలు పరచటం ఎలాగ? దీనికి కావలసిన ధనం ఎక్కడినుంచి వస్తుంది?

విద్యాభ్యాసం 1921 నుంచీ, రాష్ట్ర ప్రభుత్వానికి సంబంధించిన విషయం. ప్రతిరాష్ట్రం తన హక్కుల విషయంలో ఎంతో అప్రమత్తత ప్రదర్శిస్తూ ఉంటుంది. సేల్సుటాక్సు, రవాణా పన్నులు మొదలయిన వాటివిషయంలో కేంద్రం జోక్యం రాష్ట్రాలు సహించవు. అఖిల భారత ఉద్యోగాల సృష్టి విషయంలోనూ ఇంతే. కేంద్ర విద్యాశాఖమంత్రి 'సంఘం' సిఫార్సులని ఎలా అమలు పరచాలో సూచించారు. కాని ఆయన సూచనలని రాష్ట్రప్రభుత్వాలు అమోదిస్తాయా?

సంఘం రిపోర్టు స్కూలు టీచర్లమీద ఎన్నో ఆంక్షలు విధిస్తుందిట. కొత్త జీతాల అమలు పరిచిన తర్వాత ప్రయివేటు ట్యూష్న్లు చెప్పుకోవచ్చునో లేదో తెలియదు. న్యూఢిల్లీలో టీచర్ల ప్రయివేట్లు మాత్రం కరెన్సీనోట్ల శాసనాన్ని మాత్రమే గుర్తిస్తాయా అన్నట్లు ఉంటాయి.

"భారత ప్రభుత్వం టీచర్లకి కనీస వేతనాలు నిర్ణయించి వాటిని ఇచ్చేందుకు తగిన ధన సహాయం రాష్ట్రాలకి చెయ్యాలి. ప్రతి అయిదు సంవత్సరాలకీ జీతాలని పరిశీలించి కొత్త వేతనాలు నిర్ణయించాలి. కరువుభత్యం తక్కిన ప్రభుత్వోద్యోగుల కరువుభత్యాలని పోలిఉండాలి" అని చెప్తోంది ఈ రిపోర్టు. "టీచర్ల వేతనాలు వెంటనే అధికం అయ్యేందుకు కావలసిన చర్యలు తీసుకోవాలి."

ఎన్నికలు దగ్గరకి వచ్చేకాలంలో ఎన్నో సాధ్యంఅవుతూ ఉంటాయి. కాని ముఖ్య న్యాయాధిపతిగా పనిచేసిన కేంద్ర విద్యాశాఖా మంత్రికికూడా ప్రాంతీయ సంస్థల కింద పనిచేస్తున్న టీచర్లకి కేంద్రం ఆర్థిక సహాయం చెయ్యటం అనేదాన్ని రాజ్యాంగం అంగీకరిస్తుంది అని అర్థం చెప్పటం తేలిక పని కాదేమో! రాజ్యాంగంలో ఏ సెక్షనకింద ఇదంతా చెయ్యాలనుకుంటున్నారో ఎవరూ చెప్పటంలేదు.

అసలు రాష్ట్రాలకి కేంద్ర ప్రభుత్వం అతిగా సహాయం చెయ్యటంవల్లనే వచ్చింది చిక్కు. రాష్ట్ర ప్రభుత్వాలు సోమరితనం మరిగాయి. అంతేకాక మన 'ఫెడరల్' చట్టమే దెబ్బ తింటుందనే అనుమానం మనకి కలుగుతుంది. ఏ రాష్ట్రానికయినా ఇబ్బంది కలిగించాలంటే కేంద్రం ఆ రాష్ట్రానికి ఇవ్వవలసిన ధన సహాయం తగ్గిస్తే చాలు.

అందుకనే పై సంఘంవారి రిపోర్టు శ్రేయస్కరం కాదని చెప్పవలసివస్తోంది. రాష్ట్రాలు తమ హక్కులని గుర్తించి రిపోర్టులోవున్న సిఫార్సులని ఎదిరించాలి. ఇక రాజ్యాంగానికి సంబంధించినంతవరకూ ఒకప్పుడు ప్రఖ్యాత న్యాయవాదిగా పేరు పొందిన శ్రీ చాగ్లా కూడా దీనిని ఖండించాలి.

ఇటీవలే బ్రిటిష్ వైద్యపత్రిక 'లాంసెట్'లో ఒక ఉత్తరం పడింది. దానిని ఉదహరిస్తాను. సమస్యలు ఎలా పుడ్తాయో, ఎవరు వాటి సృష్టికర్తలో, వాటిని ఎలా పరిష్కరిద్దామని చూస్తారో ఈ ఉత్తరం రచయిత వర్ణించారు.

"ఇక్కడ బ్రిటన్‌లో రాయల్ కమిషన్‌లో పనిచేసే వారందరమూ మా బాధ్యతలని చాలా జాగ్రత్తగా పరిశీలిస్తాము. నిద్రలో సయితం వాటిని మరిచిపోము. నిన్నరాత్రి నాకు ఒక కల వచ్చింది.

'సోక్రిటిస్ (సుప్రసిద్ధ గ్రీక్ తత్వవేత్త) కనిపించి ఇలా అన్నాడు—

'కొందరు విజ్ఞులు కలిసి డాక్టర్ల విద్యాభ్యాసాన్ని అనుశీలించారని విన్నాను.'

'నిజమే సోక్రటెస్! అంతేకాదు. నేనూ పై విజ్ఞులసంఘంలో సభ్యుడినే' అన్నాను నేను.

'మీరు చేస్తున్న పనిఏమిటి?'

'సమాచారం సేకరిస్తున్నాము.'

'అందరిదగ్గరా. ముఖ్యంగా వైద్య విద్యాభ్యాసం గురించి తెలిసిన వారివద్ద—స్కూలు టీచర్లు, ఆచార్యులు, వైజ్ఞానికులు, అధ్యాపకులు; అంటే, వైద్య కళాశాలలో చేరే వారిని ఎన్నుకునే పనితో సంబంధం ఉన్న వారందరినీ ప్రశ్నిస్తున్నాము. వాళ్లేకదా



ఇటీవల ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ హైదరాబాద్ వచ్చినప్పుడు శాసనసభ్యుల సమావేశంలో ప్రసంగిస్తున్న దృశ్యం.

## న్యూఢిల్లీ లేఖ

మాకు తోడ్పడ గలిగినది—'

'వాళ్లేమంటున్నారు?'

'సోక్రెటెస్! నిజం చెప్పాలంటే, ఒక్కొక్కరూ ఒక్కొక్క విధంగా మాట్లాడుతున్నారు. కాని అందరూ చెప్పే దేమిటంటే, విద్యార్థులకి ఇంకా ఎక్కువ చెప్పాలనీ, వైద్యవృత్తికి కావలసిన శిక్షణ ఇంకా అధికం చెయ్యాలనీ, వైజ్ఞానిక విషయాలు ఇంకా ఎక్కువ చెప్పాలనీ, కోర్సు నిడివి తగ్గించాలనీ మాత్రం.'

'ఈ సలహాలు ఇచ్చేవారంతరూ వైద్య వృత్తిలో నిపుణులేనా?'

'కాదనుకోండి. అందరూ వైద్యవృత్తి దైనిక కార్యకలాపాలతో సంబంధం ఉన్నవారు కాదనే చెప్పాలి. ఇంకో మాట—ఎంత చదువుకున్నవాళ్లయితే, ఎంత తెలివిగల వాళ్లయితే వృత్తిలో అంత మందమతులుగా కనిపిస్తారని నేననుకుంటాను.'

'అయితే ఈ పరిశీలనలు, ఈ కమిషన్లు దేనికి?'

'అందరూ వైద్య విద్యాభ్యాస పరిస్థితి బాగా లేదంటున్నారుగా మరి? విద్యార్థుల ఎన్నిక, వారికి విద్య చెప్పే పద్ధతులు, వినియుక్త శాస్త్రాలలో శిక్షణ అన్నీ వెనుకబడి ఉన్నాయంటున్నారు.'

'వాటన్నిటికీ కారకులు ఎవరు?'

'ఇంతకాలం వైద్యవృత్తి కోసం విద్యార్థులని తయారు చేసినవారూ, శిక్షణ ఇచ్చినవారూ, తర్ఫీదు చేసినవారూ వారే.'

'మీరు తలపెట్టిన కార్యం సులభం కాదని గ్రహించాను' అంటూ సోక్రెటెస్ అదృశ్యుడయ్యాడు."

* * *

రూపాయి విలువ తగ్గింపుద్వారా ఎగుమతి చేసినవారిని బహూకరించటం అనే పథకాలని తొలగించాలని అనుకున్నారు. విలువ తగ్గింపువల్ల ఎగుమతిదార్ల 'ఆదాయాలు' 57.5 శాతం పెరుగుతుందన్నారు ప్రభుత్వ ప్రముఖులు కొందరు. ప్రభుత్వ వర్గాలలో కొందరు 'బహుమతి' పథకాలని పునరుద్ధరించటం మంచిది కాదంటున్నారు. అసలు ఎగుమతి, దిగుమతులకి ముడిపెట్టటం తప్పు అని కొందరు నిపుణులు అనుకుంటున్నారు. చక్కెర, యంత్ర పరికరాల ఎగుమతికి సబ్సిడీలు ఇవ్వటం ఇంతకన్నా మంచి పని అని వారి అభిప్రాయం.

అవసరం అయి స్వంతంగా వాడుకునే వారికి తప్ప దిగుమతి లైసెన్సులు ఇవ్వటం మంచిది కాదని ప్రభుత్వవర్గాలవారు అనుకుంటున్నారు. దిగుమతి లైసెన్సులని ఒకరికొకరు మార్చటం మంచిది కాదు. ముడి సరుకు లేక బాధ పడుతున్న పరిశ్రమల ప్రాముఖ్యతని పరిశీలించి లైసెన్సులు ఇస్తారు. 'పవర్' (శక్తి) కూడా ముడి సరుకు కిందే లెక్క.

ఇక 'రూపాయి వ్యాపారాలు' చేసే దేశాల సంగతి; ప్రస్తుతం రష్యా పరిస్థితి—రూపాయి విలువ తగ్గింపు దృష్ట్యా—బాగుంది.

భారతదేశం చేసే ఎగుమతుల వెలలు పెరగరాదని రష్యా వాదం.

అయితే, భారతదేశానికి రష్యా చేసే ఎగుమతుల (అంటే మన దిగుమతుల) వెలలు మాత్రం 57.5 శాతం పెంచాలని రష్యా అంటోంది.

శ్రీ మనూభాయి షా (భారత కేంద్ర వాణిజ్యమంత్రి) అందుచేతనే అవసరంగా రష్యా వెళ్ళవలసి వచ్చింది. ●

# క్లిష్ట పరిస్థితి తొలగింది





















## బాధ అనేది మాకు ఒక సమస్య...చూడండి మేము మీకు ఏవిధంగా సహాయపడతామో!

పరిశోధన: 'ఆస్ప్రో' యొక్క పరిశోధనా సంస్థలోని ఒక పరిశోధనా దళానికి నేను ఉపదేశకుడను. బాధను ఆపుజేయడానికి మంచి మంచి పద్ధతులను కనిపెట్టుట మా పని. ఈ విషయమును గురించి ఏకాగ్రతతో ప్రపంచమంతటా పరిశోధనలు జరుపుతున్న అగ్రగణ్యమైన పరిశోధనా సంస్థలలో మేము ఒకరము. నొప్పిని నివారించుటకు నేడు క్రొత్త మార్గము 'ఆస్ప్రో' ఫార్ములా అని మేము తెలుసుకొన్నాము. అందుచేతనే ప్రపంచమంతటా డాక్టర్లచేతను, ఆసుపత్రులలోను ఇది వాడబడుతోంది.

బాధ అంటే ఏమిటి? మెటాబొలిక్ ఉత్పత్తులు, దేహము వాటిని తీసుకొని పోగలిగే కంటెహెచ్చు వేగములో, స్నాయువులలో కూడుకొనిచేరి పోవడం వల్ల మరుగుపడిన వాపు కలుగుతుంది. దానితో నరములకు ఒత్తిడి కలిగి బాధ కలుగుతుంది.

'ఆస్ప్రో' ఎలా పనిచేస్తుంది: 'ఆస్ప్రో' దేహములో వెంటనే యిమిడి, వాపును, నరముల మీద వత్తిడిని తగ్గించి నొప్పిని వెడలగొడుతుంది.

'ఆస్ప్రో'ను ఈ వ్యాధులకు వాడండి: నొప్పి • తలనొప్పి • ఒంటినొప్పి • పంటినొప్పి • కీళ్ల నొప్పి • జ్వరముతో కూడిన జలుబు • ఫ్లూ కీళ్ల నొప్పులతో గూడిన జ్వరము.

మోతాదు:
పెద్దవారికి: రెండు బిళ్లలు. అవసరమైతే తిరి. వేసుకొనండి పిల్లలకు: ఒక బిళ్ల లేక మీ డాక్టరు సలహా ప్రకారము వాడండి.

A.G.25.66 TEL




**'ఆస్ప్రో'**
**నొప్పిని**
**వెడలగొడుతుంది!**

# వేసవిన సీజల్లు

ఎమ్. ఆర్. ప్రసాద్

భోజనం ముగించి హోటల్లోంచి బయటికి వచ్చాను. హోటలు ముఖద్వారాని కిరుపక్కలా పూలతీగలు అందంగా పెరిగి తీగ్రిలా అమరి వున్నాయి. పూగుత్తులు వేళాడుతూ కమ్మని వాసన వేస్తోంది. రెండు గుత్తులు తుంచి వాసన చూశాను.

హాయిగా వుంది మల్లెల వాసన.

ఆ మాటే అన్నాను పైకి.

వక్కపొడి నోట్లో వేసుకొని సిగరెట్ ముట్టిస్తున్న శ్రీను నవ్వాడు. "మల్లెలు కావు బ్రదర్. అవి జాజులు" అన్నాడు.

నవ్వొచ్చింది నాకు. నిజమే. ఈ పొరబాటు తరచూ చేస్తుంటాను. మల్లెలకీ జాజులకే కాదు. సంపెంగలకీ సన్నజాజులకీ కూడ భేదం తెలీదు నాకు. అదే నేను జీవితంలో కూడ చేసిన పొరబాటు.

ఇద్దరం రోడ్డుమీదికి వచ్చాము. ఆకాశంలో చంద్రుడు స్వచ్ఛంగా ప్రకాశిస్తున్నాడు. శ్రీను బూటు టకటక శబ్దం స్పష్టంగా వినబడుతోంది.

"రేపటి నుంచి ఈ హోటలు భోజనం అన్నా నీకు తృప్తిపొందనుకొంటాను?" అన్నాడు శ్రీను.

తబ్బిబ్బాను.

"ఉదయం వస్తుందేమిటి రాధ వదిన?"

రాధ వదిన!

నా భార్య అనూరాధ!

నేను సన్నజాజిగా పొరబడ్డ సంపంగి!

"కాదు. ఇవాళ తొమ్మిదింటికి" అన్నాను.

"మరి స్టేషనుకి వెళ్ళవా?"

"ఎందుకు వెళ్ళనా? ఈ పాటికి కారు సర్వీసింగ్ అయి ఇంటికి వచ్చి వుంటుంది. దాన్ని తీసుకువెళ్ళాలి స్టేషనుకి. ఇంకా టైం వుందిగా."

శ్రీను మాట్లాడకుండా నడవసాగాడు. వీధి చివరి దాకా వచ్చాము.

'సో_లాంగ్' అన్నాడు శ్రీను.

"అలానే. మరి నీ కెప్పటి దాక యీ అవస్థ?" అన్నాను నవ్వుతూ. శ్రీను కూడ నవ్వాడు. "శాంతి కూడ రేపో ఎల్లుండో వస్తుంది. ఎక్కువరోజులు ఒకర్నొకరు వదలి వుండలేం నీలాగ!" అన్నాడు.

నా హృదయం బాధగా మూల్గింది.

అవును. రాధ వెళ్ళి నాలుగు నెలలవుతోందిగా మరి!

శ్రీనుని వదలి ముందుకు సాగిపోయాను. ఎందుకో ఆకాశంలోని చంద్రుడు అంత హాయి నివ్వటంలేదు. చేతిలోని జాజులని రోడ్డు మీద విసరేశాను. ఆవరణ దాటి బంగళా ముఖద్వారం కేసి నడవసాగాను.. ఇల్లంతా బోసిపోయి వుంది. రాధ లేకపోతే ఇల్లంతా బోసిపోయి వుంటుంది. ఆమె వున్నా ఆమె ప్రవర్తన వల్ల నా హృదయం వెలవెలా బోతుంది.

బంగళాలోకి వెళ్ళకుండా లాన్‌లో పచార్లు చేస్తూ సిగరెట్ ముట్టించాను. ఎర్రని నిప్పు ముద్ద సిగరెట్‌ని మింగుతూ నిశ్శబ్దంగా ముందుకు సాగిపోతోంది. బాధగా పొగలని వగరుస్తోంది సిగరెట్!

అగ్నిలాంటి రాధ మౌనం!—ఏది ఉత్తరాలకి ఒక మారయినా సమాధానం యివ్వని ఆమె మౌనం నా హృదయాన్ని కాల్చేస్తోంది. సమాధానం ఎందుకు యిస్తుంది? ఇవ్వదు. ఉత్తరాలు వ్రాస్తే తన గొప్పతనమంతా తరగిపోదూ?

డ్రైవరు వచ్చాడు. కారుసిద్ధంచేయమని చెప్పాను. తను రానా అనిఅడిగాడు.. అక్కర్లేదు, బజారుకి వెళ్ళి కాసిన్నిపళ్ళు, పాలు పట్టుకురమ్మన్నాను. సరేనని వెళ్ళిపోయాడు. బంగళాలోకి నడిచాను.

రంగయ్య ఎదురొచ్చాడు.

"అమ్మగారి గది శుభ్రం చేశావా?"

"చేశానండి"

"లైబ్రరీ?"

"అంతా శుభ్రం చేశానండి"

మళ్ళీ బయటికి నడిచాను. నాలుగు సిగరెట్లు అయ్యాయి అరగంటలో. ఆలోచిస్తూ కారులో కూర్చొని కారును కదలాను. స్టేషన్ చేరేటప్పటికే రైలు వచ్చి వుంది. పక్కనరెండు సూట్‌కేసులు, పళ్ళబుట్ట, మరేవో సామానులతో విసుగ్గా నుంచొని వుంది రాధ.

అందమైన నా అనూరాధ!

"రాధా వచ్చావా"

రాధ కళ్ళు నావైపు తిరిగాయి.

కళ్ళతోనే మాట్లాడించాను. ఎలా వున్నావు అన్నాను. ఎన్నిరోజులు అన్నాను.

"వచ్చేశావా రాధా" అన్నానుకళ్ళతోనే

"అరగంటనుంచి కాచుక్కూచోవాల్సి వచ్చింది ప్లాట్‌ఫారంమీద" అంది రాధ చిరాగ్గా.

"సారీ రాధా. ఇండియాలో రైళ్ళు పకాలానికి వస్తాయని తెలీదు" అన్నాను!

"బాగుంది నిట్టు! నడవండి .....అబ్బబ్బ ఆ డ్రైవర్‌వెధవ రాలేదూ?....... "మాట్లాడుతూనే స్టేషన్ బయటికి నడిచింది రాధ.

పోర్టర్ సామానులన్నీ కారులోకి చేరవేశాడు.

"ముందు సీటో కూర్చో రాధా"అన్నాను

"ఎక్కడ కూర్చుంటే ఏమిటి?" స్వగతంలా మాటాడుతూ వచ్చి కారు ముందు సీట్లో కూర్చుంది రాధ

కారుస్టార్టు చేశాను.

"ఎలావుంది రాధా నీ ట్రిప్?"

"సరదాగావుంది. ఆగాలి, ఆవాతావరణం ఆ థ్రిల్ కావాలనుకొన్నా దొరకవు పట్నవాసాల్లో. ఇంకా నాలుగు రోజులుందామనిపించింది మాలతితో పాటే. వీరేమో బెంగెట్టుకొన్న పసిపాపలా రోజుకో ఉత్తరం వ్రాస్తుంటం!" అంది.

"నిజంగా బెంగపెట్టుకొన్నానురాధా" ఆమెకళ్ళలోకి చూస్తూ అన్నాను. నా హృదయంలోని భావమది. అంతకంటే బాగా చెప్పలేక పోయాను.

"ఆ సోదురూ! నాలుగు నెలల్లో ఇక్కడేదో మునిగిపోయినట్టు" అంది రాధ తేలిగ్గా.

కాసేపు ఇద్దరిమధ్యమౌనం అలుముకొంది. కారుకిటికీలోంచి వీస్తున్నగాలితెరలు రాధముంగురులని అలవోకగా కదలిస్తున్నాయి. వాటినిసర్దుకోటానికి విఫలప్రయత్నం చేస్తోందిరాధ. విసుగ్గావున్నా ఆమెమొహం ఎంతో ఆకర్షణీయంగా వుంది.

రాధభుజంపై చెయ్యివేశాను.

"అబ్బా..... చిరాగ్గావుంది" అంటూ అతినున్నితంగా నాచేతిని తొలగించింది.

దృష్టి రోడ్డుమీదికి సారించాను.

"ఉత్తరాలు వ్రాయలేదు. విందుచేత రాధా?"

"అసలు తీరికలేదు. అయినా ఏం వ్రాయమంటారు చెప్పండి?" అంది. అదోలా చూశాను.

"ఏమోబాబూ! నాకసలు ఉత్తరాలు వ్రాయటమే అలవాటు లేదు........"

అవును.

అలవాటులేనిదే ఉత్తరాలు ఎలా వ్రాయగలదు? మెడలో స్టయిల్‌గా స్టెత స్కోప్ తగిలించుకొని రోగులని పరిశీలిస్తూ తనమెడికల్ డిగ్రీని సద్వినియోగం చేసుకో గలదు. మహిళామండలిలో గంటల తరబడి ఉపన్యాసాలివ్వగలదు.

భర్తకు ఉత్తరాలు వ్రాయలేదు!

ఊహూ! రాధ మారదు! మాలతితో నాలుగు నెలలున్నంత మాత్రాన ఎందుకు మారుతుంది? మారుతుందనినేనెందుకనుకో వాలి?

కారుని ఆవరణలోనికి మళ్ళించాను. బంగళా లోపలికి నడిచాము. రాధస్నానం చేసి వచ్చింది. డాబామీద పక్కలు వేయ మని చెప్పాను రంగయ్యకి.

"డాబామీద ఎందుకు?" అందిరాధ.

"బాగుంటుంది రాధా— వెన్నెల" అన్నాను.

"ఓ! కవిహృదయం" అంటూ నవ్వింది.

డాబాపై పక్కమీద కూర్చొని ఆపిల్సు తింటోంది రాధ. ఆకాశంలోని చంద్రుడిని చూస్తూ కబురు చెబుతున్నానునేను. శ్రీను, శాంతి సంగతి చెప్పాను.

రాధ నవ్వింది "పూర్ శాంతి! ఎప్పుడూ ఒకటే లోకం. అలాంటి వారి జీవితంలో థ్రిల్ వుండదు. కావాలనుకొన్నా దొరకదు." అంది.

ఈ "థ్రిల్" అనే పదాన్ని రాధ చాలా మార్లు ఉపయోగిస్తుంది. ఆ థ్రిల్ ఏమిటో నాకు ఎంత ఆలోచించినా అర్థం కాదు. ఒకసారిఅడిగాను కూడా. నవ్వేసి ఫూరు కొంది. మరోమాటు అడిగితే మీకు అర్థంకాదు పొమ్మంది. బహుశా ఆంగ్ల నవలల ప్రాబల్యం కావచ్చు.

"ఇక తినలేను బాబు" అంటూఆపిల్ ముక్కల్ని ప్రక్కకి తోసేసి రజాయి కప్పుకొంది రాధ.

నేను మా ఆఫీసు సంగతులు చెప్పాను. తనులేకపోతే నేనుఎలా బాధ పడానోచెప్పాను.

ఊఁకొడుతోంది రాధ అస్పష్టంగా. నేను మాట్లాడుతున్నాను.

రాధ 'ఊఁ' లు ఆగిపోయాయి—

నిద్రపోయి చాలా సేపయి నట్లుంది!

*　　*　　*

"అరే బోలెడు పెర్రీమేసన్లు కొన్నట్లున్నారే" అందిరాధ ఉదయాన్నే బల్లమీదున్న స్టాన్లీగార్డెనర్ నవలలుచూస్తూ. ఒకనిముషం నిలుచుండి పోయాను. నాలో నిగ్రహించుకొనేశక్తి లేకపోయింది.

"నీకువచ్చినంతబాగా నాకు ఆంగ్లంరాదు లే రాధా" అన్నానువ్యంగంగా. రాధమొహంలో మార్పులేదు. "ఆంగ్లం విషయంకాదు నేనంటున్నది. ఆ పుస్తకంలో బోలెడుమెడికల్ టర్ములుంటాయని........"



"నువ్వేం పుస్తకాలు తెచ్చావురాధా?" మాట్లాడుతూ వెళ్ళి ఆమె తెచ్చిన పుస్తకాలసంచి తెరిచాను.

"మీకు అర్థంకావు లెండి" అందిరాధ.

ఎవరో చెంపకాయచెళ్ళున చరచినట్లయింది!

గుండెల్లో బాకు దూర్చినట్లయింది! చేతిలోని పుస్తకాల వలానే పట్టుకొని చేతిలోని పుస్తకం వంకచూశాను. "దిసెకెండ్ సెక్స్" — పాకెట్ సైజు పుస్తకం. సామాన్యులకి అర్థంకావటానికి వ్రాసినదే.

ఆమాటే అన్నాను.

"నాఉద్దేశ్యం అదికాదు. మీకు అలాంటి పుస్తకాలంటే ఆసక్తి తక్కువని! మీ కోసం......."రాధనడుస్తూ వెళ్ళి సూట్

కేన్‌లోంచిరెండుఆంగ్లనవలలు ;ఒకతెలుగు నవల, ఓడైరీ, క్రొత్త కలం తీసినాకు అందించింది.

ఆనవల నా అభిమాన రచయితలవే.

డైరీ నిజంగా బాగుంది.

కలం ముద్దొస్తోంది.

—అయినా నామనసు శాంతపడలేదు. రాధ ఏమీ పట్టనట్లు బట్టలు సర్దు తోంది.

"థ్యాంక్స్" అని బయటికి నడచాను.

మధ్యాహ్నం రాధ మ్యాట్నీకి వెళ్లటానికి సిద్ధమవుతోంది. మహిళామండలి ప్రెసి

# వెగసిన నీడలు

డెంట్‌కి ఫోనుచేసింది. అంటేనాకు ఆహ్వానం లేదన్నమాట.

హార్డీనవల "ఫార్‌ఫ్రం ది మ్యాడింగ్ క్రౌడ్" మరోమాటు చదువుతూ కూర్చు న్నాను.

'బెత్సాషిబా' వ్యక్తిత్వం ఎన్నిమాట్లు చదివినా అర్ధంకాదు నాకు రాధ ప్రవర్త నలా.

చకచకా టాయిలెట్ ముగించింది రాధ. జోళ్లు తొడుక్కుంటూ అంది "వస్తారా?" అని.

ఏదారావు బంధువునో పిలుస్తున్న ట్లుందా పిలుపు.

నిర్లిప్తంగా నవ్వాను "మీప్రెసిడెంట్ వుందిగా........"

"నాకు తెలుసు!—నాస్నేహితురాళ్లు ఎవ రున్నా మీరు రారని" వేగంగా అటునుంచి వెళ్లిపోయింది.

కాసేపటిలో ఆవరణలో కారుస్టార్ట యిన శబ్దం వినవచ్చింది. నిర్జీవంగాచూస్తూ కూర్చున్నాను. టేబిలుమీద రాధ యిచ్చిన డైరీ కలం వున్నాయి. డైరీ తెరచి వ్రాశాను.

"రాధ నాకు అర్థంకాదు"— అని.

అయిదింటిదాకా అలానే కూర్చుండి పోయాను. విసుగెత్తింది. మనసు బాగాలేదు. రాధ, వాళ్లందరితో టిఫిన్లూ, కాఫీలు ముగించుకొని వచ్చేటప్పటికి ఏడుదాటు తుంది. బట్టలు మార్చుకొని బీచికి బయలు దేరాను..

బీచిలో శాంతి కూర్చునివుంది. శాంతి దేవతలా! శ్రీను దూరంగా చిన్నబ్బాయిని తీసుకువెళ్లి అయిస్‌ఫ్రూట్ కొనిపెడు తున్నాడు. దగ్గరకు నడిచాను.

చిన్నగా నవ్వింది శాంతి నన్ను చూసి.

"ఎప్పుడువచ్చావు?"అన్నాను

"మధ్యాహ్నం" అంది శాంతి

మధ్యాహ్నం వచ్చి విశ్రాంతికూడా తీసుకోకుండా భర్తతోపాటే బీచికి వచ్చిం దన్నమాట అప్పుడే. ఆమాటే అన్నాను శాంతితో.

"ఇంతకంటే విశ్రాంతి ఏమిటి?" అంది.

నవ్వి ప్రక్కన కూర్చున్నాను.

శ్రీను దూరంగా చిన్నబ్బాయిని నీళ్ల దగ్గరకు తీసుకవెడుతూ అలలు దగ్గరగా వచ్చినపుడు వెనక్కి పరుగిడి వస్తున్నాడు.

ఆదృశ్యం చూస్తున్న శాంతి కళ్లు ఆనందంతో మెరసిపోతున్నాయి.

"ఒక్కడివే వచ్చావేం?— రాధ వచ్చిం దటగా?"

"తెలిసే అడుగు తున్నావా శాంతీ?" శాంతి నావైపు చూసింది. ఆమెకళ్లలో సానుభూతి నిండుకొనివుంది "నిన్ను బాధ పెట్టాలని కాదు రామం— ఇంకా రాధ మారలేదా?"

పేలవంగా నవ్వాను.

"ఎక్కడికి వెళ్లింది?"

(45 వ పేజీ చూడండి)

సీరియల్

# ముద్దమందార



భూపతి

### జరిగిన కథ

గోపాలపురం బదిలీ అయిన వాసు జీవితంలో సింహాచలం ప్రవేశించి కొంతకాలం తర్వాత విధి తమ కలయికను బయటపెట్టబోతుందని తెల్సుకుని వాసుని వూరువదలివెళ్లి పొమ్మంటుంది. తనకు ఉన్న ఒకేకోరికగా తన కొడుకును డాక్టర్ చదివించాల్సిందిగా కోరతుంది. భాస్కరానికి వివాహం అయి కొన్ని సంవత్సరాలు గడుస్తాయి. రామాన్ని తన కప్పగించి రాధ ఈ లోకాన్ని విడుస్తుంది. వాసు సుశీలకు వివాహం చేసుకుంటాడు. కానీ ఆమె కూడా తనకు దక్కకపోవడంతో రామాన్ని సుభద్రమ్మగారికిచ్చేసి తన మకాం నూజివీడు మార్చేస్తాడు. రామం, రమణల వివాహం కోసం తన స్నేహితుని కుమార్తెలను నిశ్చయం చేస్తాడు వాసు.

## 11

సత్కార్యం పెళ్లి దగ్గర పడుతోంది. నీదయవల్ల అన్ని సవ్యంగా జరుగుతున్నాయి. ఒక్క రమణ విషయంలోనే నీ పద్ధతి నా కర్థం కాలేదు. అతని కిప్పుడు చదువు కూడా అయిపోడంవల్ల, వేరే వ్యాపకం ఏమీ లేదు. రోజూ నా ప్రాణం తోడేస్తున్నాడు. సూర్యం కూడా యీ విషయం మీద నన్నడిగాడు. ఎప్పటికైనా రమణకు నీ దగ్గర నెలవు కల్పించు. మరీ ఆలస్యమైతే అతను పిచ్చివాడయిపోయి, ఎవరికీ వుపయోగం లేకుండా పోవచ్చు—

ఉత్తరం మడిచి డ్రాయరులో దాచేశాను.

* * *

ఆనాటి నుంచీ రామం ప్రవర్తనలో ఏదో మార్పు వచ్చినట్టనిపించింది. నన్ను చూసి అసహ్యించుకుంటున్నాడేమో ననిపించింది. కానీ, ఆ నీడను చూసి నేనే భయపడుతున్నానేమోనన్న అనుమానం వచ్చింది. కానీ, అది నీడకాదు. నా పీడ.

ఒకనాటి సాయంత్రం రామాన్ని నా గదిలోకి పిలిచి, "నీతో కలిసి పని చేయడానికి మరొక అతను కూడా వస్తున్నాడు. అతను నీ లాగే మొన్ననే పరీక్ష ప్యాసయ్యాడు. మీరిద్దరూ అన్నాదమ్ముళ్లలాగ వుండాలి. తెలిసిందా" అన్నాను. రామం మవునంగా తలవూపాడు.

భారంగా మరో రెండురోజులు గడిచాయి. ఆ రోజు నిద్ర లేచేసరికి రామం ఒక టెలిగ్రాం పట్టుకుని వచ్చాడు. అది భాస్కరం వద్దనుంచి.

రమణ, నేనూ వస్తున్నాం.

అది వుంది. నాకు ముచ్చెమటలు పోశాయి. చెప్పాలి, చెప్పాలి అని ఒక జీవితకాలం దాచిన విషయం, చెప్పి తీరాల్సిన విషయం— చెప్పవలసిన సమయం వచ్చి, పీకల మీద కూర్చోబోతోంది. టెలిగ్రాం మీది తేదీ చూశాను. ఇరవయ్యోతారీఖున వస్తున్నట్టుంది. అంటే ఎల్లుండి తెల్లవారుతూనే వస్తారన్నమాట.

నాకు రెండురోజులే వ్యవధి.

నా ముఖంలో మార్పు రామం గమనిస్తున్నట్టు అనుమానం వచ్చి, తిన్నగా నా గదికి వెళ్లిపోయాను. పక్క గదిలోంచి

రామం మాటలు వినిపిస్తున్నాయి. నేను యాంత్రికంగా గోడవారకు వెళ్ళి, చెవులు రిక్కించుకుని నిలబడ్డాను.

"తెలీదు బాబూ! మద్రాసులో ఎవరో భాస్కరం గారనే ఆయన అయ్యగారి స్నేహితులు. వాళ్ళ యింటికి వెళ్ళారు."

అది మేనేజరు కంఠం.

"మరి యీ రమణెవరు ?" అంది రామం గొంతు. పిల్ల జమీందారు, హోదాలో అడుగుతున్నాడు. నేను వూపిరి బిగపట్టాను. ఇక జాగు చేస్తే అదే ప్రశ్న నిలబెట్టి నన్నూ వెయ్యొచ్చుననిపించింది. ఆ గదిలోంచి వాళ్ళు మాట్లాడుకుంటున్న గదిలోకి వెళ్లి అటునుంచి మేడ మీది నా గదికి వెళ్ళిపోయాను. హృదయంలో ఏదో తీరని ఆరాటం కలిగింది.

జాగా ఆలస్యం అయ్యేలోగా రామానికి అసలు సంగతి చెప్పాలి. చెప్పి తీరాలి. ఇక నాకు కాలం కూడా ఆట్టేలేదు. పాతిక సంవత్సరాలు ఎదిగిన నా పిరికితనం నన్ను వదిలిపోడానికి నిరాకరిస్తోంది.

'నేనే జకిల్ని నేనే హైడ్ని' అని చెప్పడానికి డాక్టర్ జకిల్ ఎంత మానసిక వ్యధకు గురి అయ్యేడో అనిపించింది.

ఆ సంగతి చెప్పలేక జకిల్ ఆత్మహత్య చేసుకున్నాడు. నా గతీ అంతేనా! నిజంగా అంత అదృష్టం నాకు పడుతుందా!

ఆయాసంతో రొప్పుతూ అటూఇటూ తిరిగాను. చన్నీళ్లస్నానం చేసి, జిన్ పోసిన పానీయం తాగి, మేడ దిగి, తోటలోకి వచ్చాను. ఏ మందారపువ్వు కోసుకుని కారెక్కి కళింగం చేరాను. చేతులు వణుకు, గుండె దడ తగ్గలేదు. చేతిలో మందార పువ్వు క్రిందపడింది.

ఎంతమంది బాధతో చూశాను. ఈ నాడు నా బాధకి నేను సిద్ధపడాల్సిన హేతువు వచ్చింది. మందార పువ్వు నాకేసి చూసి నవ్వింది. నవ్వినది మందారపువ్వు కాదు. సింహాచలం. నా పిరికితనానికి నవ్వింది. క్రింద పడ్డ మందారపువ్వు తీసి చేత్తో పట్టుకున్నాను. కళ్ల వెంట నీరు చిల్లులపడ్డట్లు కారింది.

చైలేను. నే చైలేనే లేను. నాకా ధైర్యం లేదు. పాతిక సంవత్సరాల క్రితం పాతిపెట్టిన యీ రహస్యాన్ని తీయడానికి నా శక్తి చాలదు. నా అంత ఎదిగిన కొడుకుతో నా నైతిక పతనాన్ని గురించి, నా పాపానికి ఫలితంగా యీ లోకంలో జన్మించిన ఒక అమాయకుడి కథనూ చెప్పగలనా లేను...

# ముద్దమందార

కానీ చెప్పితీరాలే!!

ఆత్మహత్య చేసుకుంటేనో?

సింహాచలం చేసుకుంది. వస్తానన్న నేను రాకపోయేసరికి తన జీవితాన్నే అంతం చేసుకుంది. అది కూడా ఒక పవిత్రమైన దినం.. నాగులచవితి నాడు నాగేంద్రుని చేత—

నా శరీరం మీద పాము పాకినట్టయ్యింది.

నాగులచవితి!

ఎల్లుండి—రమణా భాస్కరం వచ్చేరోజు.

సింహాచలం ఆత్మహత్య చేసుకున్న రోజు.

వాళ్ళు వచ్చే ముందు. నేనూ ఆత్మహత్య చేసుకుంటే? అపుడు నేను చనిపోతే వాళ్లిద్దరినీ భాస్కరం సమాధాన పరచగలడు. నా సమాధి మీద వాళ్లిద్దరి చేతా కనీసం చెరో మందారపువ్వూ వేయించగలడు.

నిజంగా నేను చనిపోతే!

నా శవం మీద అంతా పడి ఏడుస్తున్నారు. భాస్కరం సుమతి, రమణ, మోహన్, ప్రేమ, ప్రేమ కూతుళ్ళూ అంతా ఏడుస్తున్నారు. ఒక్క రామం మాత్రం లేడు. దూరంగా నిలబడి వున్న రామం దగ్గరకు వెళ్ళి, "రామం మీ నాన్నగారు చనిపోయారు" అన్నాడు భాస్కరం. రామం భాస్కరాన్ని విదిలించి పారేసి, "హు . నాన్నట నాన్న. సిగ్గులేదు...పైగా ఎవతో కీ పనిమనిషికి పుట్టినవాడా నా కన్న! ఛీ—ఛీ" అంటున్నాడు.

కళ్లు నులుపుకుని, చీకటిలో దారి చూసుకుంటూ కారు దగ్గరకువచ్చి తలుపు తీశాను. కాళ్ళ క్రిందనుంచి జరజర మని ఏదో పాకింది. ఏదోకాదు పాము. సింహాచలాన్ని చనిపోయిలా చేసినందుకు పాము పంతం నా మీద కసి పట్టిందేమోననిపించింది. భయంతో ముచ్చెమటలూ పోశాయి. ఎగిరి కార్లో దుమికి, యిల్లు చేరాను.

భోజనం చైకుండా గ్లాసుడు పాలు తప్పని సరైనందువల్ల తాగి, పక్కమీద చేరాను.

ఆ రాత్రి నా పాలిట కాళరాత్రి.

—రమణ ఎవడు? ఛీ. నా పనిమనిషికి పుట్టిన ఒక అనామకుడిని నేను అన్నయ్యా అని పిలవలేను. ఇంతవరకూ చదివించిన చదువు చాలు. ఆ రహస్యమేదో మీలోనే వుంచుకోండి. నన్నవమానం పాలు చెయ్యకండి. కావలసి వస్తే వాడికో పదివేలో పదిహేనువేలో పారెయ్యండి. నా కర్మం తరంలేదు." అంటున్నాడు రామం. నాకు కోపం వచ్చింది. కొడుకు తండ్రిని ఎదిరించడమా 'హోర్నుయ్' అనరిచాను.

నిద్ర మెలకువ వచ్చింది. గాభరాపడ్డాను. కలా!! కల...అవును. నిజం అవబోతున్న కల. గొంతు తడారిపోయింది. లేచి, లైటు వెలిగించి, మంచినీళ్లు తాగాను. గది దాటి బయటికి వచ్చాను. మేఘాలు నల్లగా మృత్యువులా వున్నాయి. దీపావళి ముసుర్లు భయంకర గర్జనలు నా పిరికితనాన్ని మరింత రెచ్చకొడుతున్నాయి.. లోపల కొచ్చి, తలుపు వేసి భప్పెట్టి తీసి అందులోంచి రూపాయి నోటు తీశాను. అది "ఆనాడు" సింహాచలం యిచ్చింది. జార్జిరాజుగారి బొమ్మ వుండాల్సిన చోటులో. సింహాచలం కనుపించింది. తడిమి చూశాను. తిరిగి జార్జిరాజు గారే వున్నారు.

నోటును భద్రం చేసి పక్కమీద పడుకున్నాను. తెల్లవారుతూనే రామానికి చెప్పేసి తీరాలని నిర్ణయించుకున్నాను.

బయట పురుములు వాన రూపం దాల్చాయి.

* * *

తెల్లవారుతూనే వాతావరణం ప్రశాంతంగా వుంది. రాత్రి గాలికి రాలిన ముద్దమందారపువ్వులన్నీ రాముడు, సింహాచలం నా బల్ల మీద శుభ్రంగా పెట్టాడు. కాఫీలయ్యాక మేనేజరు చేత రామాన్ని రమ్మని కబురు పెట్టాను. రామం వచ్చాడు.

"అడ్రసు చెప్తాను. వెంటనే రావలెను అని టెలిగ్రాం యివ్వు" అంటూ భాస్కరం అడ్రసు యిచ్చి, "నీతో ఓ విషయం చెప్పాలి. కూర్చో" అన్నాను. రామం భయం భయంగా కూర్చున్నాడు. నేను గొంతు సవరించుకుని ప్రారంభించాను.

"రమణ ఎవరో నీకు తెలుసుకోవాలని వుంది కదూ" అన్నాను. రామం చిన్నగా తలవూపి "వూ" అన్నాడు.

"ఆ కోర్కె వుండడంలో తప్పేమీ లేదుకానీ, మేనేజర్నీ పనివాళ్లనూ అడిగి కుటుంబానికి సంబంధించిన విషయాలు ఆరాలు తీయడం మంచి పనికాదు. విషయం నీకు సంబంధించినదయితే నేనే చెప్తాను. నా వ్యక్తిగత విషయాల్లో తలదూర్చేంత సాహసం నీకు పనికిరాదు. అంత ధైర్యం వుంటే అడిగేదేదో నన్నే అడగాలి. రాత్రి భోజనాలయ్యాక, పదింటికి మేడ మీదికిరా. జీవితంలో నువ్వూహించలేనివీ, వూహించనివీ ఎంత విషయాలు చెప్తాను. ఆ కొతి

గ్రాం యివ్వడం మర్చిపోక. పెద్ద కారు యీ రాత్రి బెజవాడ పంపు రేపు భాస్కరం అనే ఆయన, రమణ అనే అతనూ వస్తున్నారు. అన్నట్టు టెలిగ్రాంలో మన కారు పంపరన్నూ. ఇహ వెళ్ళొచ్చు" అన్నాను. రామం తలవంచుకుని వెళ్ళిపోయాడు.

రామం వెళ్ళాక, తిన్నగా అల్బం రూముకి వెళ్ళాను. గదిలో గోడ మీద సింహాచలం పటం వ్రేళ్ళాడుతోంది.

అల్బమ్ వొళ్ళో పెట్టుకుని, కుర్చీలో కూలబడ్డాను. రాధ ఫోటో వున్న పేజీ తీశాను.

రాధ నాకేసి జాలిగా చూసింది.

'రాధా! మన రామూన్ని డాక్టరు చదివించాను. వాడు కోరుకున్న పిల్లనే పెళ్లి చేయడానికి నిశ్చయించాను. నువ్వు నన్ను క్షమించలేకపోయావు. వాడు ముమ్మూర్తులా నీ కొడుకు. ఈవాడు నా చరిత్ర విని వాడు క్షమిస్తాడా అనే భయం నన్ను బాధిస్తోంది. వాడు నన్ను క్షమించేలా దీవించు రాధా" అని గొణుక్కున్నాను. నా కంటి నీరు రాలి, రాధ కళ్ళ మీద పడింది. తుడిచేశాను.

మరో పేజీ తిప్పాను.

కుశలం!

పాపం! నా పాపానికి ఎరఅయిన అమాయక ప్రాణి. నా పాపాన్ని నిండు మనస్సుతో క్షమించిన పవిత్రమూర్తి.

నా ప్రాణం వుస్సురుమంది.

అల్బమ్ మూసేసి, పటం దగ్గరకు వెళ్ళి చేతులు కట్టుకుని నిలబడ్డాను. సింహాచలాన్ని ఒక వరం కోరాను.

"సింహాచలం! నీకు చేసిన బాస ప్రకారం కుశ రమణను డాక్టరు చదివించాను. నేను రావడం ఆలస్యం అయ్యిందని నువ్వు ఆత్మహత్య చేసుకున్నావు. నన్ను శపించకు. సింహాచలం, నేను పాపినే. అయినా యింత శాపానికి తట్టుకోలేను. తెల్లారితే రమణ వస్తాడు. లోకానికి రమణ నా కొడుకని చాటుతాను. నా పెద్ద కొడుకుని చాటుతాను." అని గొణిగాను.

బల్ల మీద నిలబడి; బొమ్మకి పట్టిన దుమ్ము దులిపాను. పాతదండ తీసిపారేసి, కొత్త దండ కుట్టించి వేశాను. సింహాచలం నన్ను క్షమించినట్టనిపించింది. అలానే కుర్చీలో భవిష్యత్తు ఆలోచిస్తూ కూర్చున్నాను.

రామం, రమణా 'శుభలక్ష్మణులా'గ అన్యోన్యంగా వుంటే యిక నేను జీవితంలో పొందాల్సిన ఆనందం ఏమీలేదు. విశ్రాంతిగా కన్నుమూయవచ్చు. అలాకాపోతే...ఆలోచిస్తే భయం వేసింది. కుర్చీలోంచి లేచి సింహాచలం పటం ముందు నిలబడ్డాను.

"నీ హృదయావేదన శాపంగా మారి నా జీవితాన్ని సర్వనాశనం చేసింది. ఇది నిజం..ఇక నీ శాపాన్ని నేను భరించలేను. భరించలేను సింహాచలం...."

హృదయావేదన దుఃఖంగా రూపొందింది. వెక్కి వెక్కి ఏడ్చాను.

చాలాకాలం తరువాత వెంకటేశ్వరుని పటం ముందు నిలబడి, చేతులు జోడించాను.

"—ఆపద మొక్కులవాడన్నారు నిన్ను. నన్నీ ఆపద నుంచి కాపాడావో నీకే తెలియాలి. నేను నిన్ను అడగని వరం లేదు. నువ్వు నాకిచ్చిన వరమూ లేదు. నా మీద యింత కసిపూనడానికి నేనే నేరం చేశాను? ఇకనైనా నన్ను కరుణించు తండ్రీ" అంటూ ఏడ్చాను. కంఠమంతా వెఱుగు రాసుకుపోయింది.

పక్క మీద పడి నిద్ర పోయాను.

తెలివి వచ్చేసరికి అరయ్యింది. ఆదరా బాదరా స్నానం చేసి తిరుపు పొద్దుకు చేరుకున్నాను. కాలో నిమిషం వస్తూ వచ్చింది. రామంతో రాత్రికి ఎలాగ చెప్పాలో నిశ్చయించుకున్నాను. ఓ గంటసేపు అక్కడ గడిపి, యింటికి వచ్చేశాను. ఆకలి వేయడం వల్ల పాలూ, లొట్టి రూముకే తెప్పించుకుని తిని, మనస్సు పటిష్ఠంగానూ, నిర్మలంగానూ వుండడానికి భగవద్గీత చదువుతూ కూర్చున్నాను.

ఎనిమిది, తొమ్మిది, పది గడియారం వరసన గంటలు కొట్టింది. లేచి నిలబడ్డాను. వాన ఎప్పుడు ప్రారంభమయ్యిందో చాలా చిక్కగా వుంది. వాచీ చూశాను. పదీ పావయ్యింది. రామం యింకా రాలేదేమిటని నౌకర్ని పిలిచి అడిగాను.

"లేదు బాబూ" అన్నాడు వాడు.

"అంటే" అన్నాను.

రామయ్య నసిగాడు, "మీరం టేసరి మీరు నిద్దపోతున్నప్పుడు అబ్బాయి గారు కారేసుకుని వెళ్ళారు బాబూ, ఇంకా రాలేదు. బెజవాడగాని వెళ్ళారేమో "అన్నాడు.

బెజవాడలో ప్రేమ అత్తవారున్నారు. రామం ప్రేమించినమ్మాయి బెజవాడ వస్తే చూడడానికి వెళ్ళాడేమో! ఛీ..ఈ రాత్రి చెప్దామనుకుంటే వాడెక్కడపోయాడు? తెల్లవారి అటు భాస్కరం, రమణా వచ్చేస్తారు.



# ముద్దమందార

ఈతోగా చెప్పాలనుకున్నది ఇలా అయ్యేం దేమిటి అని ఆలోచిస్తూ కుర్చీలో కూర్చున్నాను.

వాళ్ళెదురుగా చెప్తే రామం ఎదురు తిరిగితే. నానా రభసా అయితే!!

వీల్లేదు. మొద బుచ్చుకుని గొంతు తాను. ఆస్తిపాస్తులు కోర్టు ద్వారా చూసు కుంటాడు.

బయట గాలివాన ఎక్కువయ్యింది.

తొలకు వచ్చి, పక్క మీద చేరాను.

తెల్లవారుజామున అయిదింటికి మెలకువ వచ్చింది. గమ్మునలేచి ముఖం కడుక్కుని స్నానంచేసి పూజామందిరంలోకి వెళ్ళాను. చేతులుజోడించి వెంకట రమణుని పటం ముందు నిలబడ్డాను.

కోర్కె కోరుకోడానికి సిగ్గువేసింది.

దొంగ తన దొంగతనం పట్టుబడకుండా వుండాలని కోరుకుంటాడు. హంతకుడు తన హత్యాకాండ బయల్పడకూడదని ప్రార్థిస్తాడు. ఇవన్నీ దేముడెందుకు తీర్చాలి?

అవును. ఎందుకు తీర్చాలి?

నాకు సమాధానం తోచలేదు.

“భగవంతుడా జరిగినదంతా నీకూ తెలుసు. నాకు తెలుసు. జరగబోయేది నీ ఒక్కడికే తెలుసు. ఈపాటికే న్యాయనిర్ణయం అయిపోయుంటుంది. నీ యిష్టం వచ్చినట్టు యీ నాటకాన్ని ముగించు. నేను కేవలం నీచేతిలో కీలుబొమ్మని. నేనేకాదు. ఈ ప్రాణికోటి అంతా అంతే......అవును అంతే” అన్నాను.

నా ముక్కలు దేముడికి సవాలులా ఉన్నట్టు అనుపించింది. అయినా పాపం చేసి, దేముడి ఎదుట నిలచి, నేనే పాపం చేయలేదు.అనే సాహసంనాలో లేకపోయింది.

అగరువత్తులు వెలిగించి, వెండిపీనుగు తొండంలో గుచ్చాను. మరోసారి నమస్కరించి, బట్టలు మార్చుకుని గబ గబ మూడో అంతస్తు ఎక్కాను. బెజవాడనుంచి వచ్చే కారు రోడ్డుమార్గం వంకర టింకర్లుగా కనుపిస్తోంది. ఏోపావుగంటయ్యేసరికి దూరాన్న కారు కనుపించింది. అది రమణ, భాస్కరాలను తీసుకు వస్తున్న కారు, నా గుండెవేగంగా కొట్టుకుంది.

ముందు రమణా భాస్కరంవస్తే!!

రమణతో నా జీవితం, అతని జీవిత రహస్యం చెప్పేసి,“నువ్వు నా కొడుకువి.” అని చెప్పేస్తే!! ఆ తరువాత రామానికి కూడా చెప్పవచ్చు.

అవును. అప్పుడు రామం వివకలప్పుడు. వివిలరాలి, ఈ వూహ బాగుందనిపించింది, ఆ ఆలోచనలకు క్రిందనుంచి నొకక అతీ తాయం కలిగించింది.

“బాబూ” అన్న ఆర్తనాదం భయంకరంగా వినిపించింది. అది రామయ్యగొంతు.

నా శరీరం కంపించిపోయింది. అదే కేక మళ్ళీ మరింత భయంకరంగా వినిపించింది. రామయ్య అలాటి ఆర్తనాదం ఎందుకు చేశాడో అర్థంకాలేదు. గమ్మున మెట్లమీదుగా పరిగెట్టబోయి, కాలు మెలికపడి కూర్చొబడిపోయి, లేచి క్రిందకు పరిగెత్తాను. కింద ఎవ్వరూలేరు. బయట ఏ దో గోల వినిపిస్తోంది. పోలుదాటి బయటకువచ్చాను.

నాకాళ్ళు స్తంభించిపోయాయి.

“పొద్దునే పొలానికి వెళ్ళాంబాబూ! మీా కారక్కడ కనబడింది. తిరామాపి సిత బాబుగారు ఆ పక్కనపడివున్నారు. మేం దగ్గిర వెళ్ళిచూశాం. రాత్రి కురిసినవానలో బట్టలు తడిసున్నాయి......

నాకు కళ్ళు చీకట్లు కమ్మాయి.

.......రాత్రి పాము కాటేసుంటుంది బాబూ! ప్రాణం రాత్రిపోయినట్టు కనిపిస్తుంది.......

నాహృదయం చిన్నాభిన్నమయిపోయింది.

బయట కారాగింది. భాస్కరం, రమణ దిగి, పరుగునవచ్చారు. నా కళ్ళు వాళ్ళవైపు తిరిగాయి. “ఏవయ్యింది? ఏవిటది?” అనరిచాడు భాస్కరం నా భుజం కుదుపుతూ.

నాకళ్ళు రామంమీాంచి, రమణమీాదకు మళ్ళాయి.

రమణ—నా పాపానికి ప్రతిఫలం.....నాకు దక్కిన కొడుకు......

రమణని ఆపాదమస్తకం చూసిన నాకళ్ళు అతని పాదాలవద్ద ఆగిపోయాయి.

నా చూపు స్తంభించింది.

రమణ ఎడమకాలి బూటుక్రింద......మందార....ముద్దమందారపూవు నలిగి, గిల గిల్లాడుతోంది.

రాత్రి వానకు రాలిన పువ్వది.

రమణకాలిక్రింద నలిగినది ముద్ద మందార పువ్వుకాదు.

నాపాపం.

నలిగిపోయింది.

నాశనమయిపోయింది.

నాపాపం తీరిపోయింది.

కళ్ళలో నీరెనాడో కరువయ్యింది.

“ఏం జరిగింది” అంటూ భాస్కరం నన్ను కుదుపుతూ అడిగాడు. నా దృష్టిని మరల్చలేకపోయాడు.

అతనికి చెప్పవలసిన పనేలేదు.

(అయిపోయింది) ●

# వాటర్‌బరీస్ కాంపౌండ్

ఎత్తి లేబిలు

## త్రాగి జలుబును ఎదుర్కొండి



బలహీనపడిన శరీరంలో జలుబు మీలోని రోగమును ఎదుర్కొనే శక్తిని పోగొట్టుతుంది. దేహమును బలహీన పరచి రోగములు కలిగే అవకాశమును కలిగిస్తుంది. వాటర్‌బరీస్ కాంపౌండ్ యొక్క విశిష్టమైన త్రివిధ క్రియ ఉపశమనమును కలిగిస్తుంది, మళ్ళీ శక్తినిస్తుంది మరియు రోగనిరోధక శక్తిని హెచ్చుచేస్తుంది. దానిలోని ముఖ్యముగా కలిపిన క్రియోసోట్ మరియు గయకోల్ జలుబునుండి ఉపశమనము కలిగించును; దానిలో చేరి ఉన్న శక్తివంత మరియు బలవర్ధక పదార్థములు, మాల్ట్ మరియు ప్లీహ సారములు ఆకలిని పుట్టించును, కోల్పోయిన శక్తిని భర్తీచేయును. రోగము మళ్ళీ రాకుండా ఉండేలా రోగనిరోధక శక్తి కలిగించును.

ఈ శీతోష్ణస్థితిలో రోగనిరోధక శక్తికి ఎత్తి లేబిలుగల వాటర్‌బరీస్ కాంపౌండ్ త్రాగండి.








వాటర్‌బరీస్ కాంపౌండ్‌లోగల క్రియోసోట్ మరియు గయకోల్ కఫమును విడదీసి ఉమ్మిలో పోయేలా చేయును మరియు ముక్కుపట్టను అడ్డును. అవి ఊపిరితిత్తులను శుభ్ర పరచును, దగ్గు, జలుబు, ఉబ్బసపు అసౌఖ్యము, శ్వాసనాళపు అస్వస్థతలను పోగొట్టుటలో సహాయపడును మరియు రోగము మళ్ళీ రాకుండా చేయును.

# వాటర్‌బరీస్ కాంపౌండ్

దగ్గు, జలుబు, శ్వాసనాళపు అస్వస్థతలు, ఉబ్బసపు అసౌఖ్యములను
నివారించుటకు శక్తిని కలిగించును

వార్నర్ - హిందూస్తాన్ లిమిటెడ్ - బొంబాయి.

'ఆంధ్రసచిత్ర వారపత్రిక'లో ప్రచురణకు ఇండియన్ ఇంక్ తో వేసిన కార్టూనులు మాత్రమే పంపాలి. సాధారణంగా 4" × 2", 4" × 4" సైజులో మాత్రమే ఉండాలి.



# వారఫలం

**22-7-1966 శుక్రవారం మొదలు**
**28-7-1966 గురువారం వరకు.**

**మేషం :** ఏవ్యవహారాన్నీ పూర్తిగా నెరవేరవరకు నమ్మడానికి అవకాశంలేదు. వృత్తిలో కొంతమంది వ్యక్తులు మిమ్మల్ని కవ్వించి కలహ ప్రసంగం చేస్తారు. వారాంతంలో అన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడతాయి. ఉద్యోగంలో మెప్పుకు రాని కార్యభారాన్ని వహిస్తారు.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో అధిక వ్యయం జరుగుతుంది పుణ్యకార్యాలు చేస్తారు.

**వృషభం :** రావలసిన డబ్బు సమయానికి అందక పోవడం వలన మీ కార్యక్రమాలను మార్చుకోవలసి వస్తుంది. ప్రయాణాలు శ్రమమీద ఫలిస్తాయి. అధికారుల వలన జరగ వలసిన వ్యవహారాల్లో అభివృద్ధిని సాధించగలరు. విద్యావైజ్ఞానికరంగాల్లో విశేష్కృషి రాణించగలదు.

స్త్రీలకు— ఆరోగ్యం సామాన్యంగాఉంటుంది వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మిథునం :** ఇతరుల నిమిత్తం చేసే ప్రయత్నాలు సఫలంగా నెరవేరతాయి గాని విశ్రాంత వసుల్లో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో సాహసముతో కూడిన వ్యవహారాలు లాభించగలవు. నూతనవ్యాపారాల వారంభం దా వేయడంమంచిది. సాటివారిలో గౌరవం బాగా ఉంటుంది.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. అనుకూలాల వార్తలను వింటారు.

**కర్కాటకం.** వృత్తివ్యాపారాల్లో శ్రమకలిగినా, దానికి తగిన ప్రతిఫలం లభించగలదు. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు ప్రోత్సాహకరంగాఉంటాయి ఉద్యోగంలో అధికారుల ఆదరాభిమానాలను పొంద గలరు. సంతానానికి అనారోగ్యం చేయవచ్చును మిత్రులకు సహాయం చేస్తారు

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. ప్రయాణాలోచనలు చేస్తారు.

**సింహం :** గ్రహబలం బాగా ఉంది. వృత్తివ్యాపారాల్లో నీ కార్యక్రమాలు చురుకుగా సాగడం వలన ఆదాయం బాగా ఉంటుంది. ఆర్థిక వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. కొంత మంది వ్యక్తులు మిమ్మల్ని పొగడడం ద్వారా తమపనుల్ని సాధించకొనడానికి ప్రయత్నిస్తారు. సజ్జన సాంగత్యం లభిస్తుంది

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి.

**కన్య:** వృత్తి వ్యాపారాల్లో ఇంది వరకు యేర్పడిన అవరోధాలు తొలగిపోతాయి. భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాల్లో నూతనావకాశాలు లభిస్తాయి రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. ప్రయాణాలు ప్రయోజనకరంగాఉంటాయి. సాంఘిక వ్యవహారాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగానే ఉంటుంది. బంధు మిత్రులను కల్పుకొంటారు.

**తుల :** వారం ప్రారంభంలో వృత్తి వ్యాపారాల్లో చికాకులు యేర్పడి తరువాత సర్దుకొంటాయి. వ్యాపారంలో కొంతమంది వ్యక్తులు మిమ్మల్ని నమ్మించి మోసం చేయడానికి ప్రయత్నిస్తారు. సాహసముతో కూడిన వ్యవహారాల్లో జోక్యం చేసికోవడం తగదు. వివాదాలకు నష్టపోవచ్చును.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది.

**వృశ్చికం :** ఈవారం శుభాశుభ మిశ్రమంగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో కొత్తపోటీని యెదుర్కోవలసి వస్తుంది. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలకు లొంగిపోవడం తగదు. ఉద్యోగంలో కార్యభారం పెరిగినా మీకృషిని అధికారులు గుర్తించగలరు. ఆడంబరం కోసం వ్యయంచేస్తారు.

స్త్రీలకు—ఆరోగ్యం ప్రస్తుతం బాగానున్నా నిర్లక్ష్యం చేయడం తగదు పుణ్యకార్యాలు చేస్తారు.

**ధనుస్సు :** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరుతాయి గాని వారాంతంలో చికాకులు యేర్పడతాయి. వృత్తిరీత్యా చేసే ప్రయాణాలు శ్రమ మీదఫలిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు కొంతవరకు లాభిస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాల సంచలనం అధికం కాగలదు.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి.

**మకరం :** వృత్తి వ్యాపారాల్లో ఇంది వరకు చేసిన ప్రయత్నాలు ఫలించడం వలన ఆదాయం బాగా ఉంటుంది. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరతాయి. ఉద్యోగంలో మీ ఆలోచనలకు తగిన అవకాశాలు లభిస్తాయి. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతిలభిస్తుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**కుంభం :** కొన్ని వ్యవహారాలు సులువుగానెరవేరినా, మరికొన్నింటిలో శ్రమకు గురికాగలరు. రావలసిన డబ్బుమీద ఆధారపడి ఇతరులకు వాగ్దానాలు చేయడం తగదు. ప్రయాణాలు లాభదాయకంగా ఉంటాయి. వారం ప్రారంభంలో ఆకస్మికంగా చికాకులు యేర్పడతాయి.

స్త్రీలకు— కుటుంబ కార్యక్రమాలు శ్రమమీద నెరవేరుతాయి. బంధువులకు సహాయంచేస్తారు.

**మీనం :** ఏవ్యవహారంలోను ఆరంభంలో కనిపించిన అనుకూలాలత ఆఖరు వరకు నిలవదు. సామాన్యమైన పనులకు కూడా విశేషమైన ప్రయత్నం చేయవలసి వస్తుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. కుటుంబ సంతోషం లభిస్తుంది. మిత్రులసహాయం లభించ గలదు.

స్త్రీలకు— ఆరోగ్యం సామాన్యంగాఉంటుంది. దైవ కార్యాలు నెరవేరుతాయి.

—మహేష్

శుభకార్యాలకు ఆవిడ పెద్దభరోసా— ఒక్కోసారి సమయానికి వంటవాళ్ళు దొరక్కపోతే.

ఇంకా అత్తయ్యను మీకు కళ్ళకు కట్టినట్టుండాలంటే ఎన్నో సంఘటనల ద్వారా ఆవిడను వ్యక్తీకరించవచ్చు. అవన్నీ కథలో మిమ్మల్ని అక్కడక్కడ పలకరిస్తూనే వుంటాయి.

ఇంతకీ చెప్పొచ్చేదేమిటంటే మా—అలాటి అత్తయ్య రేపు దీపావళికి మా ఇంటిని సందర్శించబోతోంది. సందడిగా వుంటుందన్న సంతోషం మాట ఎలావున్నా లేనిపోని గొడవలెన్ని తెచ్చి పెడుతుందోనన్న భయం సన్నోముల పీకుతూనే వుంది. ఇంకా సరిగ్గా ఇరవై నాల్గు గంటల వ్యవధి మాత్రమే వుంది మా అత్తయ్య రావడానికి. ఎందుకయినా మంచిదని ఒకటికి రెండు సార్లు మా ఆవిడతో చెప్పాల్సింది చెప్పి, తదనుగుణంగా ఎలా ప్రవర్తించాలో, ఎలా ప్రతివిషయాన్ని తేలిగ్గా తీసుకోవాలో కూడా చెప్పేశా! ఎందుకంటే ఇదే మొదటిసారి మేం కాపరం పెట్టిం తరువాత ఇద్దరూ కలవడం. క్రిందటిసారి మా రెండో వాడి పురిటికి వెళ్ళడంతో, అత్తయ్య వచ్చినా మా ఆవిణ్ణి చూడ్డం, కలవడం పడలేదు. అందుకే నాకీ ముందు జాగ్రత్త తప్పని సరైంది పాఠి.

బుధవారం పోయి గురువారం వచ్చింది. పది గంటలకి భోజనం చేసి కాలేజీకి వెళ్ళిపోయాను. వెళ్ళానన్నమాటే గాని మనస్సు మాత్రం ఇంటి దగ్గరే షికార్లు చేస్తోంది. ఏమో! నే వుంటే ఫర్వాలా! ఇద్దరికీ ఒకరి కొకరు తెలీదు. అంతకీ విగ్రహాన్ని ముందే వర్ణించాను కాబట్టి ఏమంత బెంగారు పడాల్సిన పన్లేదు. ఎటొచ్చి నే వెళ్ళేలోపునే ఏమన్నా జరుగుతుందేమోనన్న అదుర్దా తప్పేస్తే! ఇంక నాలుగు...మూడు..రెండు గంటలు అని అనుకుంటుండగానే లాస్టవరు రానే వచ్చింది. ట్రయోడ్ గురించి నాలుగు ముక్కలు చెప్పి బయటపడ్డాను.

సందు మొదట్లో కొచ్చేసరికి మా రెండోవాడు ఎదురొచ్చి "నాన్నా! మనింటికో పెద్ద బామ్మగారు వచ్చారు. ఎంత పెద్ద బామ్మగారనుకున్నావ్! అమ్మ కంటే, నీ కంటే, మేస్టారి కంటే పెద్దబామ్మగారు" అంటూనే సైకిల్‌కి అడ్డంపడ్డాడు. ఆహా దిగిందన్నమాట శాల్తీ అనుకుంటూనే సైకిల్ దిగి వాణ్ణెక్కించుకుని,



ఇంట్లో అడుగు పెడుతుండగానే అత్తయ్య ఎదురొస్తూ అందుకుంది—

"ఏరా చిట్టీ! స్టేషన్ కన్నా రాలే దేంరా? మామయ్య ఉత్తరం అందలేదేమిట్రా?"

"అందింది కానీ, నాకే కుదర్లేదత్తయ్యా సరిగ్గా చివరి గంటే క్లాసుంది...ఏం కనుక్కోలేకపోయావా? అయినా ఏం కష్టంలే మామయ్య చెప్పే వుంటాడు వివరంగా" అన్నాను.

"ఆ. ఆయన చెప్పార్లే! 'ప్రెస్సు ఎదురుగా అంటే ఏ రిక్షావాడన్నా తీసికెళ్తాడు' అంటే సరిపోతుందిట్రా?"

"అవున్లేగాని ఇంతకీ కష్టమైందా రావడం చెప్పు?"

"లేదులే! మీ మామయ్య చెప్పడానికి చెప్తే! ఏదో కాస్త నోట్లో ఆ కాస్త నాలుకా వుంది కాబట్టి సందుమొదట్లో దిగంగానే ఓ కుర్రాడ్ని అడిగితే చెప్పాడ్లే!"

అవున్లే నీ నాలుకే నీకు పెద్ద అండ అని మనస్సులోనే అనుకుని 'సరే అయితే కులాసాగానే వచ్చావు కదా పోనీ అదే కావల్సింది' అంటూ సందర్భం మార్చకపోతేను' అత్తయ్యను శాంతపర్చకపోతేను కావుండదని—

"అత్తయ్య! బొత్తిగా సత్తులా అయిపోయావ్! ఏం జ్వరమోగాని" అన్నాను నిజానికి నాకే మాత్రం భేదం కనిపించకపోయినా.

"అవున్రా! అయిదారు లంఖణాలు చేశాను. తెలుగు మందు కూడా పుచ్చుకున్నాను. టానిక్కు తాగాను. పథ్యం మాంచి కట్టుదిట్టంగానే సాగింది. కాని అదేవిటోరా మత్తిలా వుండేదాన్నా. బొత్తిగా ఆ సత్తువే లేదనుకో, పిరసమూ తగ్గలేదు. ఏమైనా మునపటి తీరు ఇంకా రాలేదురా!"

"ఎలా వస్తుందిలే అత్తయ్యా!.... ఆ ఇంతకీ ఇల్లాలేదీ" అంటుండంగానే "ఆ ఇల్లాలికేంగానీండి, దొడ్డమ్మగారూ మీరు స్నానం చెయ్యండి త్వరగా నీళ్ళు తోడాను. అవతల అవి చల్లారిపోతున్నాయి...ఆ మీరలా బజారెళ్ళి ఓ నాలుగు చక్రకేళీలు, పావు శేరు పాలు పట్రండి, మళ్ళీ పాలసంఘం మూసేస్తారు." ప్రవేశంలోనే వెయ్యి చదివింది మా ఆవిడ.

"పళ్ళెవరికి? పాలెవరికి? నువ్వేమన్నా ఉపోషిలేమిట్ ఖర్మ! లేకపోతే గురువారాలు మొదలు పెట్టావా?" ఏవరికో తెలీక అడిగేశాను.

"నా క్కాదండీ. మీ అత్తయ్యకే రాత్రిళ్ళు అన్నం పరిపట్టంలేదుట. చపాతీలు నాలుగు, నాలుగు పళ్ళూ తిని పావు శేరు పాలు తాగి వుంటున్నారట. ఇవాళే చెప్పాను పాలవాడికి. ఇంకో అర్ధశేరు పాలో రేపట్నుంచి పట్రమ్మని." అని మా ఆవిడ అంటుండగానే ఇంట్లో కెళ్ళిన అత్తయ్య తిరిగివచ్చి—

"ఒరేయ్! బొత్తిగా నాలుగంటే నాలుగే పట్టుకొచ్చేవ్ !ఓ అరడజనో డజనో పట్రా! పండుంటే పుచ్చిపోదులే" అని పురమాయించింది.

'అపునవును చెల్లకపోదు కూడా నువ్వంటే' అని మనసులోనే అనుకుని —

"సర్లే నువ్వెళ్ళిస్నానం చెయ్యి"...'ఊబాగానే వుంది ఇంతవరకేం జరగలేదు కద?' అన్నాను మా ఆవిడతో.

"భగవంతుడి దయవల్ల లేదు. అయినా ఇంతవరకూ ఇద్దరం ఈ హాల్లోనేగా వున్నాం ఆమాటా ఈమాటా చెప్పుకుంటూ", నా అదుర్దా తీర్చింది మా ఆవిడ.

"ఎన్నింటి కొచ్చిం....."

"చిట్టీ! వచ్చారా! ఈ గుమ్మం పాడుగానూ!" అత్తయ్య గావుకేకతో నా ప్రశ్న పూర్తి కానేలేదు.

"ఏమిటత్తయ్యా? ఏం జరిగింది" అంటూనే వెళ్ళాను. అత్తయ్య నెత్తి మీద చెయ్యి పెట్టుకుని బాత్‌రూంలో కూలబడి వుంది 'అయ్యయ్యో! లేయిట్రా! ఏం జరిగింది?'అంటూ లేవదీయబోయాను, కానీ 'నావల్ల ఏమవుతుంది' అని అనుకుందేమో? తనంత తానే లేచి హాల్లోకి నడుస్తూనే రామాయణం మొదలు పెట్టింది.

"ఏం కొంపరా దిక్కుమాల్న కొంపలు. చిన్నప్పుడు మా అమ్మడు కట్టిన బొమ్మరిల్లే నయం. పైగా ముప్ఫై, నలభై లు అడిగి ఛస్తారు ఈమాత్రం కొంపలకే" అంటూ ఇంకా చెప్పబోయేసరికి—

"అత్తయ్యా! వూరుకో" అంటూ సైగ చేశాను. అవును మరి వీనర్లు వింటారేమోనని నా భయం. కానీ అదేమో పట్టు పట్టు—

"అవున్రా వెధవ కక్కుర్తి వీళ్ళూనూ

కుమ్ములేవైనా తిరగాలా; తలలు పగిలి పోవాలా? వెధవది స్నానాల గదుల్లోనే వచ్చే స్తుందా లాభమంతా! ఇంకాస్త పెద్ద గుమ్మం పెడ్తే వాళ్ల సొమ్మేం పోయింది చెప్పు?....అహ నేనే మన్నా తప్పంటు న్నానా?".

అత్తయ్య ఎంతసేపటికీ ఆపకపోయేప్ప టికి—

"అత్తయ్యా! పక్కనే ఇంటివాళ్ళు" అని సంజ్ఞ చేసి నోరు నొక్కుకుని మొత్తా నికి నానా హంగామా చేసాను అత్తయ్య వుపశమనానికి. అనాల్సిన నాలుగూ, పెట్టా ల్సిన నాలుగూ అయిం తర్వాతనేగానీ అత్తయ్య స్నానానికి వెళ్ళింది కాదు.

"అమ్మ బాబోయ్! వచ్చిన మూడు గంట లకే ఇంత తిరణాలని సృష్టించింది ఇంట్లో. ఇంక ముందెలా వుంటుందోనన్న బెంగ పెరిగిపోయింది ఆ రాత్రల్లా. అత్తయ్యను గురించే ఆలోచన. అలా ఆలోచిస్తున్నప్పుడు ఎప్పుడు నిద్రపోయానోగాని, మెలకువ వచ్చేప్పటికీ ఆరైంది.

వళ్ళు విరుచుకుని హాల్లోకి వెళ్లాను. అత్తయ్య పక్కన మణిగాడు. ఆ ఇద్దర్నీ చూస్తే ఆనాడు పూతనా కృష్ణులు కూడా ఇలాగే వుండివుంటారని అనిపించింది. ఈ [illegible] [illegible] దాకా, చాప చాలని శరీరం [illegible] కనిపిస్తుంది. అవతల నడవలోకి వెళదామంటే అత్తయ్య కాళ్ళు అడ్డు వస్తు న్నాయి. లేపనా వద్దా అని ఆలోచిస్తు న్నాను. ఇంతలోనే అత్తయ్య ఆవలింతకు మణిగాడు లేచాడు.

"ఏం అత్తయ్యా! బాగా నిద్ర పట్టిందా?" అన్నాను.

"నిద్ర [illegible], [illegible], ఈ మణిగాడు రాత్రి తెల్లవార్లూ ఒకటే తన్నులు. దానికి తోడు ఇంటినిండా ఒకటే దోమలు! ఇంటికి సున్నం వేయించి ఎంత కాల మైందో?"

బాబోయ్! పొద్దున్నే మొదలెట్ట బోతోందని తలుపడి—

"ఆ కింతటి [illegible] అది పిలుస్తున్నట్టుంది" అంటూ సంద ర్భం మార్చడంతో ఆ ఆపద తప్పింది. మళ్లీ ఎనిమిది గంటల ప్రాంతాన నే రాసు కుంటున్న గదిలో ప్రవేశించి, "ఏరా పంచు [illegible] ఏమైనా వుత్తరాలు వస్తు న్నాయా?" అంది అత్తయ్య "ఆ అంతగా ఏం లేవులే!" అనడం కెందుకో ఈ రెండో

కొడుకంటే ఇంత ఇది అనుకుని. "అవున్లె గాని అత్తయ్యా! మరి పెద్ద బావ సంగ తేమిటి?" అన్నాను.

"ఒరేయ్! వాడి సంగతి నన్నడక్కు. వాడో పనికిమాలిన చవట. ఏం బావుకుందా మనో గుడివాడ వాళ్లావిడ పుట్టింట్లోనే వుంటున్నాడు."

"అయినా నువ్వే అన్నావుటగా 'నువ్వూ నీ పెళ్లాం వేరే వుండండ్రా' అని" అన్నాను అసలేం చెపుతుందోనని.

"అవున్రా! అన్నానంటే అన్నా. నేనే కాదు ఎలాంటిదైనా అంటుంది. ఎంత మెత్తని అత్తైనా అంటుంది. వాళ్ళ ఇంటిని పడి చేసే ఆటలూ పాటలూ చూస్తే— అయ్యో! బొత్తిగా ఇదేం కాలంరా! నామాట సరే అవతల మీ మామయ్య మాటన్నా భయం వుండక్కర లేద్రూ! వట్టపగలే గదుల్లో దూరడం. ఇక అక్కడినించి ఒకటే వెకవెకలూ పకపకలూ 'ఏమే ఏం చేస్తు న్నావ్? ఒసారిలా రా' అంటే 'కాసేపాగి వస్తుందమ్మో' అంటాడేరా వట్టి చవట సన్నాసి కాపోతేను! దానిష్టమొచ్చినట్లు సాగు తోందనుకో ఇంట్లో. ఇంట్లో వయ సొచ్చిన ఆడపిల్లలున్నారా? వాళ్లేమను కుంటారో అనేనా లేపోతే ఎలారా చచ్చేది? ఛ! మరీ అంత విడిచి వుండలేపోతే ఏ పట్నా నికో లేచిపోతే ఎవడేడి చాడంట! కాకపోతే మరి నలుగురు తిరిగే కొంపల్లో ఎలా చెల్లుతుందిరా? అది ఆడింది ఆట పాడింది పాటగా వుందనుకో. వాడు దానికి వత్తాసు. గదే వంటిల్లు ఆ మహా ఇల్లాలికి. హవ్వ ఎవరన్నా ఏమన్నా అనుకుంటారనేనా లేదేరా దానికి. పెద్ద ముండని నాక్కాస్త వుడకేసి పెట్టడం మాట అటుంచు పై పనికి దిక్కులేకపోయె! అసలా విడగారు లేవడమే ఎనిమిదింటికి ఇక ఆపైన గదే సర్వం. గదే లోకం. ఛీ ఛీ ఛీ! అందరూ అనడమే 'ఏమిటి మీ కోడలు కనిపించదే ఇంటికి వచ్చినా' 'వంట రాదా పిన్నీ మీ కోడలుకి' 'ఏమిటమ్మా వదినా! నువ్వే చెయ్యి కాల్చు కుంటున్నావ్ కోడలుపిల్ల వూళ్లో లేదే మిటి?' 'ఇంకా లేవ లేదేమిటి కోడలు?' ఇవీ వాళ్ల పలకరింపులూ, పరామర్శలూ. ఏం చెప్పమంటావ్ ఎక్కడికి వెళ్లినా ఇవే పలకరింపులు. ఒక ఇంటి దగ్గరకాదు, బావి దగ్గరకాదు. చివరకు దేవాలయం దగ్గర

కూడా ఇవే కబుర్లనుకో! ఎర్రగా బుర్రగా వుందని మురిసిపోయి ముందడుగు వేశానే కాని ఇలాంటి నరకం ఇంట్లో సృష్టి స్తుందనుకుంటే చస్తే ఆ గడప తొక్కనిచ్చే దాన్ను. ఛీ! ఛీ! రోజురోజుకీ పెరిగి పోతుంటేనూ! ఇక ఆగలేక విసిగి ఓ రోజున అనేసాను 'నువ్వూ నీ పెళ్లాం వేరే వుం డండ్రా!' అని—ఏరా తప్పన్నా నంటావా?" చెవుల్లో తుప్పు కాస్త వదిలిపోయింది. మాటయిన అత్తయ్య తీర్పు వ్యాసానికి. బాబోయ్! తీగ తీస్తే డొంకంతా కదిలింది. దచ్చాను లేనిపోని తద్దినం తెచ్చిపెట్టు కున్నాను. సమాధానం చెప్పకపోతే చంపే స్తుందని—

'అవున్లే గాని ఇంతకీ వాడు వెంకటా పురంలో లేడన్నమాట!' అన్నాను.

'అన్నమాటేమిట్రా! లేడనే గదా చెప్పింది. వాడికీ తెలిసొస్తుంది. ఎన్నా ళ్లుంటాడ్లే అత్తారింట్లో మటుక్కూ. మళ్లీ నా గడప తొక్కకుండా వుంటాడేమో చూద్దాం" అత్తయ్య సవాల్ చేసింది.

"అవున్లే ఎన్నాళ్లుంటాడ్లే. ఎక్కడికి తిరిగినా గూటికి చేరాల్సిందేగా చివరకి" సమర్ధించాల్సి వచ్చింది.

"బాగా చెప్పావ్!" సమర్ధనని మెచ్చు కుంది అత్తయ్య అని అన్నానేగాని అత్తయ్య సంగతి నాకు తెలీదూ? ఇక చస్తే ఆ గడప తొక్కడు వాడు. ఏ వుద్యోగమో చూసుకుని ఆ గుడివాడలోనే హాయిగా వుంటాడు. వాళ్ళ మామగారు కూడా మంచి పలుకుబడి వున్న మనిషి ఆ వూళ్లో. ఇంక ఆ సంగతిని ఆపకపోతే ఇంకేం మొదలెడుతుందోనని భయం వేసి—

"చూడత్తయ్యా! సంక్రాంతిదేమో కమక్కొ[illegible] అవుతోంది నాకు" అం టుండగానే మా రెండోవాడు

'అమ్మ అన్నానికి రమ్మంటోంది రా!' అంటూ చెయ్యి పుచ్చుకున్నాడు. తొమ్మిది న్నర కల్లా ఇల్లు వదిలాను నాలుగు మెతు కులు నోట్లో వేసుకుని. పెకండవరు పాఠం చెప్పి రూంలోకి వచ్చేసర్కి ప్రైవేటు మాస్టారు ఎదురు చూస్తున్నారు.

"ఏమండీ మాస్టారూ! ఇలా వచ్చారు కులాసావా?" పలకరించాను.

"నా కులాసాకేం లెండి"

"పిల్లలేమన్నా దోవలో పడుతున్నారా?"

"ఇక పడతార్లెండి."

"అంటే?" మేష్టారి ధోరణి బోళర్థం కాలా.

"పెళ్ళివాళ్ళు వచ్చారుగా" ఆయన సమాధానం.

"అదేమిటండీ! అలా అంటారు మీ మాటలు నాకేం అర్థం అవటంలా." అన్నాను ఆశ్చర్యంతో.

"లేకపోతే ఏమిటి? చెప్పండి మీరే! నాకావిడ చెప్పాలా? నా శాస్త్రం తెలీదూ?" అందుకున్నారు మేష్టారు. అయిపోయింది ఏదో పెద్ద రాద్ధాంతమే జరిగి వుంటుందని అనుకుని 'ఇటుండి' అంటూ కాంటీన్‌కి దారి తీసాను. నడుస్తూనే వింటున్నాను ఆయన స్వఘోష.

"అది కాదండీ! ఫలానిది చెప్పండి—అని చెప్పించుకోవాలిగాని, మీకు అవొచ్చునా, ఇవొచ్చునా? మా చిన్నప్పుడే నయం. చిన్న బాలశిక్షలూ, పెద్దబాలశిక్షలూ, గజేంద్ర మోక్షం, రుక్మిణి కళ్యాణం కంఠస్తావచ్చేవి అలా చెప్పేవాళ్ళు మాష్టార్లు. అయినా చెప్పేవాడికి వచ్చేడిస్తే కదా చెప్పించుకునే వాళ్ళని తిట్టడం, అంతెందుకూ మీకేమన్నా తెల్సా? షట్చక్రవర్తులెవరో, అష్టాదశ పురాణాలేమిటో? నవగ్రహాలేవో అంటూ మొదలెట్టిందావిడ ఎవరోగాని."

"ఆ ఆ ఇంకేమన్నా అందా?" అన్నాను ఆదుర్దాగా.

"ఒకటేమిటండీ! నేను ఒక వుద్యోగార్థినై వచ్చినట్లు ఆవిడే ఒక పెద్ద ఆఫీసరైనట్లు అడ్డమైనవీ అడిగిందనుకోండి అన్నీ విని నేనేం మాట్లాడకపోయేసరికి — 'ఆ అదిగో అలా ముంగిలా మాట్లాడకుండా కూచోడమే చెపుతుంది ఏంరాదని. ఈ పాటికి పది రూపాయలు కూడా ఎందుకు దండక్కాపోతేను! ఏం తోచకపోతే సరి! అయినా మిమ్మల్లని ఏం లాభం మావాడితోనే చెప్పేస్తాను ఇవాళే!' అంటూ కసురుకుంది. ఏమండీ ఇదేనా ఇంటికి వచ్చి చెప్పినందుకు మీ రిచ్చే గౌరవం. తగిన శాస్తి చేయించార్లెండి. ఇంకకాలు గొప్పగా ఖుద్వొచ్చింది. మీ కవసరం లేపోయినా, ఇష్టం లేకపోయినా నాకే చెప్పొచ్చుగా. అలా ఆవిడని పురమాయించి నా మీద ప్రయోగించడం దేనికి? చెప్పండి మానేస్తా మీకిష్టం లేపోతే" అంటూ వాపోయాడు వెర్రి బ్రాహ్మడు.

నాకెలా వర్ధి చెప్పాలో ఓ పట్టాన అంతు పట్టలా ఇక చివరికి—

"ఏవండి మేష్టారూ! పీరేమనుకోకండి. ఆవిడ తరహా అంతేగానీండి. ఎందుకయినా మంచిది ఈ నాల్గురోజులు ట్యూషన్‌కు రాకండి ఫర్వాలేదు. మళ్లీ చెపుతాను. అంతవరకూ రాకండి. మీరు మటుకు ఏమీ అనుకోకండి ఆవిడ తీరే అంత" అని వర్ధి

# శేషమ్మత్తయ్య

చెప్పేప్పటికి నా తల్లప్రాణం తోక్కొచ్చింది.

"హన్నా మైసూర్‌పాక్ కావాలా నీకు? మనింట్లో వుంది కూడా బోల్డు—బామ్మ గారు చేసారు కావాలా?"





ఇంటికి వెళ్లంగానే మామూలే పలకరిం పులు. ఇంతలోకి మా ఆవిడ వంటింట్లోంచి బయటకు వస్తోంది—

"హలో! గుడీవినింగ్. ఎలా కులాసానా అండి?" అన్నాను.

"కులాసా సంగతి తర్వాత చెప్తాగానిండి ముందు అర్జంటుగా నెయ్యి, మూసె రెండూ పెట్టాడాలి." అదీ ఆవిడగారి సమాధానం.

"అదేమిటే? ఈ వేల వెళ్లిపోతుందను కున్నానే!" సందేహం వెళ్లబుచ్చాను.

"నిజమే. వెళ్లేదే. ఖావాళ మైసూర్ పాక్ జంతికలూ చెయ్యకపోతే" వున్న సంగతి బయట పెట్టింది.

"అయినా పండుగ ఎల్లుండయితే ఖావాళ ఎందుక్రా ఈతతగం?"

"ఏమో! ఆవిడే నన్ను అడిగారు. 'అయ్యో పిల్లా! నీ కింకా ఎప్పుడు తెలు స్తుందే! వాడు పగలల్లా కష్టపడి వస్తాడు గాదా ఇంటికి రాగానే ఏమన్నా తినాలని వుండదుటే. ఇంకా ఎప్పుడు తెలుస్తాదే పిచ్చిదానా పైగా ఇద్దరి పిల్లల తల్లివి కూడా' అని ఎత్తి పొడిచి ఆవిడే చేశారు."

ఇంతలో అత్తయ్య దొడ్లో కాళ్లు చేతులు కడుక్కుని..వస్తూనే అడిగింది. "ఏరా చిట్టీ! ఎలా వున్నాయిరా జంతి కలు?"

"అవును గాని అత్తయ్యా! నిన్న మొన్న, అవి, గుమ్మడి తినద్దన్నారు గదా ఎందుకు చెప్పు ఇవన్నీ మేమా చూస్తూచూస్తూ నిన్ను వదలి తినలేము గదా!" అన్నాను కేవ లం అత్తయ్య ఆరోగ్యమే నాకు ముఖ్యమయి నట్టు.

"ఓరి పిచ్చి నాయనా! అమాత్రం నా ఆరోగ్యం సంగతి నాకు తెలీదుట్రా! అందు కని నాకని వేరే ఓ డజను జంతికలు నేతోనే చేసుకున్నాను. మైసూర్ పాక్ ఎలాగూ నేతోనే చేస్తాని గదా! ఇంతకీ ఎలా వున్నాయి చెప్పూ?" "ఇంకా నేను తినందే" అన్నాను నీళ్లు నములుతూ. "అయ్యో నా మోహంలా వుంది. ఇందాక ట్నుంచి అది నీకు ఇవ్వనే లేదుట్రా!" అంటూ వంటింట్లోకి వెళ్లి రెండు ప్లేట్ల నిండా రెండూ పట్టుకొచ్చింది. "చూడ్డా నికే బావున్నాయి అత్తయ్యా! ఇంక వేరే చెప్పాలా! బావుండే వుంటాయి" అంటూ నోట్లో వేసుకున్నాను. నిజంగా చాలా బావు న్నాయి.

అను దాని కింకా తెలీదనే అంటాను." '

సరే మళ్లీ ఇటు తిప్పావ్ బండిని అను కుని "పోన్లేగాని ఇటా నువ్వు. అది చూసుకుంటుందిలే" అని అప్పటికి ఆ గొడవ వదిలేశాను.

* * *

ఈ విధంగా రోజుకో పేచీతో యిల్లంతా వావా గందరగోళంగా తయారయింది. అందరూ అనడమే ఏమిటి మీ ఇల్లీ మధ్యన ఫ్యాక్టరీలా తయారయిందని. ఏంచెప్పను వాళ్లతో. నాగులచవితికి వుపోషమంటూ వా దుంప తెంపింది. పళ్లూ, ప్రసాదాలు చింతయినా తినవచ్చంటూ, ఇంతంత ప్రసాదం, ఇన్నన్ని పళ్లూ మింగడంతో వెళ్ల బుచ్చింది. చవితి వెళ్లిపోయింది. కాని మని షేం కదిలేట్టులేదు. 'పిండి వంటలు చేసి పెడుతుంటే కమ్మగా తినడానికి ఏం" అంటారు కొందరు. కాని పన్నవుతాయి గదా అని ఏనుగుని మేపగలమా? మరీ దాం తుంపతెగా అరగంటకే ఆరుసార్లా వక్క పొడి. వింత అలవాటయితే మాత్రం?— అవతలేమో పాలవాడికి పాపంలా పెరిగి పోతోంది ఈ వెలబాకీ. గోధుమరొట్టెలు, నేతి పెసరట్లు, నేతిగార్లు అంతా నేతి వరుకులో మునిగి తేల్తోంది ఇల్లు. వారాని కోసారి రెండు టిఫిన్లూ చేతికి తప్పటంలా. సాయంత్రం ఏపూట కాపూట చక్రకేళీలు— చివరికి విసిగెత్తిపోయింది ఎలా వదిలించు కోవాలిరా బాబూ అనిపించింది. నాకే కాదు మా ఆవిడకూ అదే ప్రశ్న ఎదురైకూర్చుంది. అంతకీ కొన్నిరోజులు తెలీకుండా వంటరిగా వదిలి ఏ సినిమాకో, ఫ్రెండు ఇంటికో వెళ్లి పోయేవాళ్లం. ఒంటరిగా వుండ లేకన్నా విసుగెత్తిపోతుందని. పిల్లల్ని ఆవిడ మీద ప్రయోగించేవాళ్లం. అంటే ఏంలేదు. వాళ్లేమన్నా ఆవిడనుచేస్తుంటే చూసి గూడా ఏం పట్టించుకోకుండా వుండటమే! న్యాయంగా మా మణిగాడు చాలు ఆవిడ వంగతి చూసుకోడానికి, వాడు పెవతాళే వెళ్లి ఒక్కగుద్దు గుద్దుతాడు. తంతాడు. కర్రబుచ్చుకుని బుర్ర మీద వడ్డి మీద వడ్డిస్తాడు. కుర్చీ కర్రలు తీస్తాడు. విన్యాసాలు చేస్తాడు. అయినా ఆవిడ వాడికేం లొంగలా. ఒకరోజున మా పుణ్యమా అని మాఆవిడమూడురోజులు శెలవుపుచ్చుకుంది. కాని మూడ్రోజులు మాకు వండి పెట్టి తను తిండేగాని విసుగొచ్చి లేచిపోలా వెధవది. వెళ్లమని ఘాటిగా చెప్పి ఏడవలేం. వెళ్తానని

# శేషమ్మత్తయ్య

పోతే ఆవిడతో వచ్చే చికాకులన్నీ భరించాలి గదా! ఏం చెయ్యడానికి తోచటంలేదు. కార్తీక పౌర్ణమి కూడా దాటి అమావాస్య కూడా రాబోతోంది. ఇంతలో మా తోడ ల్లుడి దగ్గర నించి వుత్తరం వచ్చింది. వాళ్ల తమ్ముడి వుపనయనం తప్పకుండా రమ్మనమని.

"అమ్మయ్యా! ఇదేదో మా మేలుకే వచ్చిం దనుకున్నాం." కాని ఓ మూల భయం. అనుమానం మొలకెత్తాయి. ఒకవేళ తనూ వస్తానని బయలుదేరదు గదా! అని. కాని అలాంటిదేమీ జరగలా. అనడానికైతే అంది.

"నిజానికి నాకైతే వద్దామనే వుందిరా!. కాని..పోన్లే వద్దులే ఎక్కడో కొడ్తే ఎక్కడో రాలినట్లుంటుందేమో! నిజమే దగ్గరా? దూపా? తోచీ తోచీనమ్మ తోడికోడలు పుట్టింటికి వెళ్తే చూసీ చూడకుండా ఆరు తట్టల పేడ చేయించార్ట వెనకింటికి అల్లానే వుంటుంది నే రావడం గూడాను. ఎందుకొచ్చిందిలే నేరాను. నన్ను మాత్రం రైలెక్కించరా. అన్నట్టు రేపు త్రయోదశి బుధవారం నాకు తార కూడా మంచిదే. మృగశిర కూడా ప్రయాణ నక్షత్రమే. మీరు ఎల్లుండి ఆర్ద్ర వెళ్లింతరువాత పునర్వసులో బయలుదేరండి అదీ మంచిదే. నాకు మటుకు రేపే బాపుంది మళ్లీ ఎల్లుండి జన్మతార అవుతుంది. ఆ అయినా ఎన్ని




ఈ కిరీటం తమ తండ్రిగారిది. ఆయన బుర్ర కొద్దిగ పెద్దది లెండి.

రోజులని ఒకళ్లింట్లో వుంటాంలే ఎప్పటి కయినా ఆయన దగ్గర కెళ్లాల్సిందాన్నేగా!" అంది.

'ఈ బుద్ధి ఎప్పుడో రావాల్సింది' అని మనసులోనే అనుకుని అన్నదే తడవుగా మళ్లీ ఎప్పుడు బుద్ధి మారిపోతుందోనని మర్నాడు సెలవు పెట్టి మధ్యాన్నం రైలు ఎక్కించి 'అత్తయ్యా! చేరంగానే వుత్తరం వ్రాయి. నువ్వు మళ్లీ క్షేమంగా చేరావని తెలిసేంతవరకూ మాకు మనస్సు మనస్సులో వుండదు సుమా. వుత్తరం మర్చిపోకు' అంటూ సాగనంపి హాయిగా గాలి పీల్చు కున్నాను. స్టేషన్ నించి ఇంటికి వచ్చాను. మా ఆవిడ బట్టలూ అవీ సర్దుతోంది.

"అదేమిటి? అవన్నీ సర్దుతావెందుకూ?" అన్నాను.

"ఎప్పటికయినా సర్దాల్సిందేగానీండి. మరి మీరు కాస్త మొన్న వచ్చిన కవరు ఇలా ఇస్తారా ఓసారి" అంది ఏదో కనిపెట్టినదానిలా.

వెళ్లి వుత్తరాల తీగనించి తీసి ఇచ్చాను.

"అహ అదికాదు దాని ఖాళీ కవరు" అంది నవ్వుతూనే. నేనూ నవ్వాపుకోలే పోయాను. ఇద్దరం నవ్వుకున్నాం. ఇంతలోనే అడిగింది "ఏమండీ! మళ్లీ రేపెప్పుడయినా మాటల సందర్భంలో ఈ విషయం బయటపడితే?"

'సరేలే ఆమాత్రం నాకు తెలీదను కున్నావా? వుత్తరం నేరాసినట్టు బయట పడదుగా. మహా అయితే 'ఏరా మొన్న మీ తోడల్లుడి తమ్ముడి వడుగు బాగ జరిగిందా' అని అడగడం దాకా వస్తే రావచ్చు. కాని దానిగ్గాను నేనివాళే మావయ్యకు వుత్తరం రాస్తున్నానుగా. 'వుపనయనం అనుకోని అవాంతరాల వల్ల అప చేయబడిందని' అన్నాను.

'అయ్యో! పాపం!! అంత శ్రమ తమ వద్దులెండి. అంత అవసరం ఏంలేదు.' అంటూ గదిలోకి వెళ్లి పెట్టె తెరిచి ఒక కవరు తెచ్చి ఇచ్చింది.

అది ఆనాడే వచ్చింది! నేను రైలు స్టేషనుకు వెళ్ళినప్పుడు వచ్చింది! ముద్ర కూడా ఆరోజుదే! ఇది నిజమయిన వుత్తరమే నాకు మతిపోయింది!! అది మా తోడల్లుడి దగ్గర్నించే వచ్చింది. వాళ్ళ తమ్ముడి వుపనయనం అని తప్పకుండా రమ్మనమనీను. ●

# అపసరణ సిద్ధాంత స్వరూపం

## మోహన్ రామ్

[మద్రాసు రాష్ట్రంలో 'ద్రావిడోద్యమా'ల పలుకుబడి, బలం గురించి ఎరుగనివారు ఉండరు. కాంగ్రెసుపార్టీకి ముఖ్య ప్రతిపక్షం "ద్రావిడ మున్నేట్ర కళగం" అని అందరికీ తెలుసు. కొన్ని విచిత్రమయిన కారణాలవల్ల ఈపార్టీకి దానితో అసలే పొత్తు కుదరని వర్గాలతో స్నేహం, (లేదా, ఒప్పందాలకి అంగీకారం) ఏర్పడుతోంది. "ద్రావిడ మున్నేట్ర కళగం" పుట్టుపూర్వోత్తరాలు, దాని చరిత్ర నాలుగు వ్యాసాలలో శ్రీ మోహన్‌రామ్ పరిశీలిస్తారు. ఇవి ఇంతకుముందు న్యూఢిల్లీనుంచి వెలువడే ఆంగ్ల వారపత్రిక 'మెయిన్ స్ట్రీమ్' లో పడ్డాయి. ఆ పత్రిక అనుమతితో వాటిని ఆంధ్రసచిత్రవారపత్రిక పాఠకులకి అందిస్తున్నాము. శ్రీ మోహన్‌రామ్ తమ వ్యాసంలో రాజకీయాలనిమాత్రమే చర్చించారు. 'ద్రావిడ సంస్కృతి', 'ద్రావిడ భాషల' చరిత్ర తెలుకోన గోరేవారు నిష్పాక్షిక చరిత్రకారుల రచనలను చదవటం అవసరం! కల్పిత కథలమీద ఆధారపడే సిద్ధాంతాలని నమ్మి, ప్రచారంచేసేవారి రచనలు అంతగా తోడ్పడకపోవచ్చు...]

అపసరణ నిషేధచట్టం అమలులోకి రావటంతో "ద్రావిడ మున్నేట్ర కళగం"వారు స్వతంత్ర ద్రావిడ రాజ్యం కావాలని అడగటం మానుకున్నారు. 'ద్రావిడనాడు' ఉద్యమం నిర్జీవంగా తయారయింది. కాని, "అపసరణ"న్ని కోరే సిద్ధాంతం, దానికి పునాది వేసిన కల్పిత కథాసారం మాత్రం సజీవంగానే ఉన్నాయి.

శాసన సభలద్వారా అపసరణమే గనుక సాధ్యమయితే, అపసరణ సిద్ధాంతాన్ని ప్రథమ మాత్రంగా పరిగ్రహించిన ద్రావిడ మున్నేట్ర కళగం లేక ద్రా. ము. క. పైన చెప్పిన చట్టం అమలులోకి రాగానే తన స్వరూపాన్ని కోల్పోయి ఉండవలసినది. కోల్పోలేదంటే అపసరణం అనే నినాదం నశించినా అది ఆదర్శంగా నిలిచిపోయిందనే అర్థం. నేడు తమిళనాడులో ఉన్నత పాఠశాల తరగతులలో అపసరణ సిద్ధాంతాన్ని రహస్యంగా నేర్పుతున్నారు. ఈ సిద్ధాంతాన్ని ఉపదేశించిన ద్రా. ము. క. మరింత బలవంతమయిపోతున్నది—'అపసరణం కావాల'నే నినాదాన్ని మానుకున్నందుకు కాదు, దానిని చాటుగా ఎన్నోవిధాల చాటుతున్నందుకు.



ఇ. వి. రామస్వామినాయకర్

పోయిన సంవత్సరం ప్రభుత్వం దూరదృష్టి చూపకుండా భాషావిధానాన్ని అమలు పరచటానికి ప్రయత్నించినప్పుడు జరిగిన అల్లరులు ఈ రాజకీయ పక్షానికి చాలా తోడ్పడ్డాయి. 1967 లో కాంగ్రెసుకి ఎదురయ్యే ప్రమాదం కేరళలోకాదు, శ్రీకామరాజ్ స్వంత రాష్ట్రం మద్రాసులోనే.

### ఆర్థిక ప్రణాళిక?

విచిత్రం ఏమిటంటే, ద్రా. ము. క. కి దృఢసంకల్పం కాని, ఆర్థిక ప్రణాళికని సమర్పించే సామర్థ్యంకాని కల నాయకత్వం లేదు. ఇన్నేళ్ళుగా ఏర్పడుతూవచ్చిన అపసరణ వాదాభిమానమే ఈ పార్టీని నడుపుతోంది. బలపరుస్తోంది. 1962 లో ద్రా. ము. క. తన శక్తిని నిరూపించుకుంది. 1967 లో మరింత శక్తివంతమయినదని నిరూపించటానికి సిద్ధంగాఉంది. స్వతంత్ర, ముస్లిం లీగ్‌లవంటి దక్షిణ పక్షాలతోకలిసి 1967 లో నిజంగానే బలవంతమయిపోగలదు.

1962–1967 మధ్య ఎక్కడో ద్రా. ము. క. 'ద్రావిడనాడు' కోరికని వదులుకుంది. కాని 1962 లో ఈ పార్టీకి పడిన వోట్ల అర్థం ఏమిటి? ఈ వోట్లువేసిన వారందరూ అపసరణవాదులేనా? లేదా, తమిళదేశంలో కాంగ్రెసుపట్ల అంత అయిష్టం ఉందా? ఈప్రశ్నలకి అసందిగ్ధంగా జవాబు చెప్పటం కష్టం. అలా చెప్పలేనంత మాత్రాన కున్నవారు ప్రమాదాన్ని గుర్తించటం లేదనయినా అనుకోవాలి, భయవిహ్వాలు అయినా అయారనుకోవాలి.

1962 ఎన్నికలలో ద్రా.ము.క. ద్రావిడనాడు నిర్మాణాన్ని ముఖ్యసమస్యగా ప్రచారం చెయ్యలేదు. అలా చెయ్యమని అప్పటి మద్రాసు ఆర్థిమంత్రి శ్రీ సి. సుబ్రహ్మణ్యం సవాలు చేశారు కాని ద్రా.ము.క. ఆ సవాలుని స్వీకరించలేదు. అలాగని వోటర్లకి ద్రా.ము.క. ఉద్దేశాలు తెలియవనికాదు. మునపటికన్నా మూడురెట్లు ఎక్కువసీట్లు సంపాదించుకున్న ద్రా. ము. క. కి రెండురెట్లు ఎక్కువ వోట్లుకూడా వచ్చాయి.

అసలు అపసరణ సిద్ధాంతం ద్రా.ము.క. సృష్టించినదా? ఈ సిద్ధాంతం 1940 ప్రాంతాలలో జస్టిస్‌పార్టీలో చీలిక ఏర్పడి "ద్రావిడకళగం" (ద్రా.క.) జన్మించినప్పుడే జన్మించింది, అందుకని 1944లో సేలంలో జరిగిన జస్టిస్‌పార్టీ సమావేశం, అంతకు ముందు ఆపార్టీ చరిత్రకూడా పరిశీలించటం అవసరం.

### బ్రిటిషు పరిపాలకుల విధానాలు

జస్టిస్‌పార్టీ బ్రిటిషు పరిపాలకుల 'భేదోపాయా'ల సృష్టి అనటంలో సందేహం లేదు. వలసదేశాలలోని అన్నిరకాలవర్గాల మధ్య చీలికలు ఏర్పరచి అధికం చెయ్యటమే ఈ ఉపాయాల లక్ష్యం. వీటిని అధికం

# దక్షిణ భారతంలో ద్రావిడోద్యమాల పరిశీలన

చెయ్యటంచేత సామ్రాజ్యవాదుల ఆధిపత్యం పెరుగుంది. భారతదేశంలో ఈ విధానం బాగా పనిచేసింది. అంతకుముందులేని 'వర్గ సమస్య' (లేదా 'కులసమస్య') ఒకటి తయారయి కూర్చుంది.

పరిపాలనలో తమకీభాగం ఉండాలని భారతీయులు కోరటంతోనే బ్రిటిషు సామ్రాజ్యాధికారానికీ వీరికీ విరోధం ప్రారంభం అయింది. ఈ కోరిక క్రమంగా ప్రజాస్వామ్య ప్రభుత్వం, తర్వాత 'హోమ్ రూల్', ఆతర్వాత 'డొమినియన్' స్థాయి చివరికి స్వరాజ్యంకావాలనే ఉద్యమాలకి దారి తీసింది. ఒక్కొక్కమార్పుతో ఒక్కొక్క వర్గంవారి ఆశలు బయట పడటమేకాక కొత్తవర్గాలసృష్టికూడా జరిగేది. కాంగ్రెసు పక్షంలో హైందవప్రభావం బాగా కనిపించేది. ముస్లింవర్గాలు తమ శ్రేయస్సు కాపాడుకొనేందుకు వేరే ఏర్పాట్లు చేసుకొనటం ప్రారంభించారు. 'భేదోపాయం' ఇలాగే పుట్టిందనవచ్చు.

ఈ ఉపాయాన్నేసిక్కులు, క్రిస్టియన్లు, పార్శీలు, ఆంగ్లోఇండియన్లు మొదలయిన వర్గాలమీదా వాడారు. వీలయినవారందరినీ 'అల్పసంఖ్యాకులవర్గం' కింద పరిగణించేవారు. దర్జీవారినీ, మంగలివారినీకూడా ప్రత్యేకవర్గంకింద జమకట్టే ప్రయత్నాలు జరిగాయి. ఉదాహరణకి—క్రైస్తవులవర్గాన్ని గుర్తించినప్పుడు ఆంగ్లోఇండియన్లని వేరే గుర్తించటందేనికి? ఈ ఉపాయం భారతదేశంలోనే కాక కెన్యా, సిలోన్‌లలోకూడా బ్రిటన్ వాడింది.

అన్నివర్గాలవారికీ న్యాయం జరగాలనే వాదం భారతదేశంలో వివిధ వర్గాలవారు ఉద్యోగాలకీ, పదవులకీ ఎలా కృషిచేశారో సూచిస్తుంది. వెనుకబడిన కొందరు మధ్య తరగతి మేధావులని రాజకీయాలలో కొంత పలుకుబడికల ఇతరవర్గాలవారు కొందరు ఎలా అణగదొక్కటానికి ప్రయత్నించారో ఈదేశంలోని "వర్గప్రాతినిధ్య" వాదం చరిత్ర పరిశీలిస్తే తెలుస్తుంది.

దేశంలోని ఆర్థిక పరిస్థితి వలసరాజ్యం ఆర్థికస్థితి కాబట్టి ఈవర్గాల పోట్లాటల



సి. ఎన్. అన్నాదురయ్

మీద తన ప్రభావం చూపించింది. సామ్రాజ్యవాదుల నియంతృత్వాధికారం ఈ ప్రభావానికి తోడ్పడింది. ప్రతికూలంగా ఉండేవారే లాలూచీ పడేవారు, ముందు పదవులు సంపాదించుకున్నవారు తర్వాత వారితో ఏగబడేవారు. పోట్లాటలు సమూహాల మధ్య జరిగేవికావు, సహేతుకంగామూ ఉండేవికావు.

1917లో మద్రాసురాష్ట్రంలో ఏర్పడిన 'జస్టిస్‌పార్టీ' చరిత్రని, పై విషయాలని మనస్సులో ఉంచుకుని పరిశీలించటం అవసరం. అంతకుముందు ఆంగ్లవిద్యాభ్యాస పద్ధతుల ఫలితాలని అధికంగా బ్రాహ్మణులే అనుభవించేవారు; ప్రభుత్వోద్యోగాలలో అధిక భాగం వీరికే దొరికేవి. అందువల్ల ఈ కులం వారి అధికారం, బలం బాగా పెరిగిపోయింది. ఉద్యోగాలు బ్రాహ్మణేతరులకి రావాలనే ఉద్యమం ఇప్పుడే ప్రారంభం అయిందన్న మాట.

జస్టిస్‌పార్టీ నాయకులలో అన్ని భాషల వారూ ఉండేవారు—తెలుగువారు, తమిళులు, మలయాళీలు. వీరు బ్రాహ్మణులని ద్వేషించినంతగా బ్రిటిషువారిని ద్వేషించలేదు. ఇది బ్రిటిషు పరిపాలకుల భేదోపాయాలకి బాగా పనికివచ్చింది. బ్రిటిషువారు జస్టిస్‌పార్టీని దీవించి ప్రోత్సహించటమే కాక ప్రాణంకూడా పోశారంటారు కొందరు.

అయితే బ్రాహ్మణ, బ్రాహ్మణేతర కలహాలు ప్రభుత్వోద్యోగాలతో నిలిచిపోలేదు. ఇవి తమిళనాడు కాంగ్రెసుపార్టీలోకి కూడా వ్యాపించాయి.

1919—36ల మధ్య తమిళనాడ్ కాంగ్రెస్‌లో ఎన్నోయుద్ధాలు జరిగాయి. ద్రా.ము.క. నాయకుడు అన్నాదురయ్ వాటిలో ఒకదానిని వర్ణిస్తారు. కారైకుడిలో త.కాం. సమావేశం జరిగిన కాలంలో శ్రీ సి. రాజగోపాలాచారికీ సత్యమూర్తికీ పడేదికాదు. అయినా శ్రీ ముత్తురంగ మొదలియార్‌ని ఓడించటానికని శ్రీ రాజగోపాలాచారి సత్యమూర్తిగారితో ఒకటయి పోయాడుట. శ్రీ ముత్తురంగ మొదలియార్ రాజగోపాలాచారి వర్గంవాడే అయినా కులాధికారాలు తమరిదామానికి దారితీయని కొందరు వ్యాఖ్యానిస్తారు. అప్పుడే రామనాడ్ జిల్లా కాంగ్రెస్ కమిటీ వారు శ్రీ రాజ

---

"క్రీస్తుపూర్వం మొదటి సహస్రాబ్దం రెండవ భాగంలో—అంతకుముందు కాకపోయినప్పటికీ—దక్షిణ భారతదేశంలో ఒక కొత్త జన సమూహం కనిపించింది. వీరు మరణించిన వారిదేహాలని కొంత కాలం గాలికివదిలి, తర్వాత తొలగించి ఎముకల ద్వారా ఉండే పెద్దరాతి పుటలలో ఉంచిన తర్వాత పాతి పెట్టేవారు. వారు ఇనుపపనిముట్లు, కుమ్మరిచక్రం వాడేవారు. వీరు అంతకుముందే అక్కడవున్న కొత్తరాతియుగపు మనుష్యులమీద ఆధిపత్యంవహించినట్లు కనిపిస్తుంది. వీటిని పోలిన సమాధులు పశ్చిమాసియా, ఉత్తర ఆఫ్రికా యూరప్‌లలో, ఇంతకీ పూర్వకాలానికి చెందినవి కనిపిస్తాయి. కాలంలో, దేశంలో ఇంతదూరం ఉన్నప్పటికీ భారతదేశంలో ఈ 'పెద్ద రాతిపుట సంస్కృతి' కీ పాశ్చాత్య సంస్కృతికీ సంబంధం లేదనలేము. ఈ 'పెద్దరాతి పుట సంస్కృతి' జనం సముద్రం మీదుగా దక్షిణభారతదేశానికి వచ్చారని, వీరే ద్రావిడభాష(ల)ని మాట్లాడేవారని, నీటిపారుదల పద్ధతులద్వారా వరిపంట చెయ్యటం వీరే ఇక్కడ ప్రవేశపెట్టారని కొందరు (హెయిమెన్ డార్ఫ్, ఇతరులు) సూచించారు. వీరు దక్షిణదేశంలోకి ఆర్యులు ఉత్తరదేశం ప్రవేశించిన తర్వాత వచ్చారని ఈ సూచనవల్ల తెలుస్తున్నది...." శ్రీ కె.ఎ. నీలకంఠశాస్త్రి, సోర్సెస్ ఆఫ్ ఇండియన్ హిస్టరీ,

# అపరణ సిద్ధాంత స్వరూపం

గోపాలాచారి వైఖరిని విమర్శిస్తూ, అది కాంగ్రెసులో బ్రాహ్మణ, బ్రాహ్మణేతరుల మధ్య విరోధాలు పెంచుకుంటుందని హెచ్చరించారుట.

**ఆత్మగౌరవోద్యమం**

రామనాడ్ జిల్లా కాంగ్రెస్ కమిటీ వారి హెచ్చరిక ఊరికేపోలేదు. ఈయుద్దాల వల్ల కొందరు బ్రాహ్మణేతరుల్ని, కాంగ్రెసు పార్టీ (కనీసం తమిళనాడులో) బ్రాహ్మణ కులంలో మేధావుల చేతుల్లో ఉందని; వారు కేవలం స్వార్థంకోసం స్వతంత్రం రాక పూర్వమే ప్రభుత్వంలో ఉద్యోగాలని తమ వారితో నింపుదామని ప్రయత్నిస్తున్నారనీ భయపడ్డారు.

నేటి ద్రావిడకజగం 'పెద్ద' శ్రీ ఇ. వి. రామస్వామినాయకర్ 1925లో కంజీవరంలో జరిగిన కాంగ్రెసు సమావేశంలో ఆపార్టీనుంచి విడిపోయి "ఆత్మగౌరవోద్యమం" ప్రారంభించారు. ఈ ఉద్యమానికి ప్రత్యేకలక్ష్యం ఉంటూ ఉండేదికాదు. అదికేవలం బ్రాహ్మణుల్ని ఎదిరించే ఉద్యమమే. నాస్తిక మతానికి దగ్గరగావచ్చే అస్పష్టమయిన హేతువాదాన్ని బోధిస్తూ చదువుకున్న బ్రాహ్మణేతర వర్గాలవారిని ఈ ఉద్యమం కూడగట్టగలిగింది. వారిలో అధికులు జస్టిస్ పార్టీకి చెందినవారే.

1930 ప్రాంతాల్లో జస్టిస్ పార్టీకి చెందిన కొందరు గొప్ప భూస్వాములు తమ పార్టీ నాయకత్వం వహించ వలసిందిగా రామస్వామి నాయకర్‌ని కోరారు. అయితే, నాయకుడు బ్రాహ్మణ ద్వేషిగా మాత్రమే ఉండాలన్నారు. శ్రీ డబుల్యు పి. సౌందరపాండ్యనాడార్, సర్ పి. టి. రాజన్, సర్ ఆర్. కె. షణ్ముగంచెట్టి, సర్ ఎ. రామస్వామిమొదలియార్ వంటి జస్టిస్ పార్టీ నాయకులు బ్రిటిష్ సామ్రాజ్యానికి విశ్వాసపాత్రులయిన భృత్యులు. వారి అధిపతుల భేదోపాయ విధానాలలో పైకి వచ్చినవారు. వారు బ్రాహ్మణులని ఎదిరించినా వారి ద్వేషంలో మత, జాత్యభిమానాలకి తావు లేదు. కేవలం బ్రిటిష్ పరిపాలన కింద వీలయినన్ని ఉద్యోగాలూ, పదవులూ సాస్త్రి చాలునమకునేవారు ఈ రకం నాయకులు. శ్రీ రామస్వామినాయకర్ మతమే వేరు.

అందుకనే ఆయన నాయకత్వం స్వీకరించినప్పటికీ, సంఘ సంస్కరణ, ఆత్మ గౌరవం బ్రిటిష్ పాలన పతనం ఈమూడూ కావాలని కోరే శ్రీ రామస్వామి నాయకర్ మధ్య, బ్రిటిష్ సామ్రాజ్యాధికారుల బంటుల మధ్య పొత్తు కుదరకపోవటంలో ఆశ్చర్యంలేదు.

1944 లో సేలంలో జరిగిన జస్టిస్ పార్టీ సమావేశంలో రెండు వర్గాలూ విడిపోయాయి. ఈ విడిపోవటంలో రామస్వామి నాయకర్‌కే ఎన్నోవిధాల విజయం లభించిందనవచ్చు.

శ్రీ సి. ఎన్. అన్నాదురయి అప్పటికే మంచి వక్తగా పేరు సంపాదించుకున్నాడు. అంతేగాక, శ్రీ రామస్వామినాయకర్‌కి నమ్మిన బంటు. ఈయనే సైతం సమావేశంలో ప్రత్యేక 'ద్రావిడనాడు' కావాలనే తీర్మానం అమలు అయ్యేటట్లు చూసుకున్నాడు.

హడావుడిగా జరిపిన వోటింగ్‌లో అమల్ని అయిన ఈ తీర్మానం ప్రకారం, 'అప్పటి మద్రాసు రాష్ట్రం భారతదేశం నుంచి విడిపోయి 'ద్రావిడనాడు' కావాలి.

ఈ తీర్మానాన్ని సరిగ్గా అర్థం చేసుకోవటం ముఖ్యం. ఒకటి, ఇది 'ద్రావిడనాడు' స్వతంత్ర రాజ్యంగా ఉండాలని దానిని అమలు జరిపినవారు అడగలేదు. ఢిల్లీలో వైస్‌రాయ్ బదులు సెక్రటరీ ఆఫ్ స్టేట్ పాలించాలని మాత్రం కోరారు. అంటే, మద్రాసు రాజధాని భారతదేశం మొత్తంలో ఉండడం కన్నా బ్రిటిష్ సామ్రాజ్యంలోనే ఉంటే మంచిదని వీరి అభిప్రాయం అన్న మాట.

రెండు; తర్వాత ద్రా. ము. క. వారు కోరసాగే ద్రావిడనాడుకీ దీనికీ భేదాలు ఉన్నాయి. ఇది అప్పటి మద్రాసు రాష్ట్రానికి మాత్రమే పరిమితమయి ఉండేది. ఈ విషయమయి సందేహానికి ఆస్కారమే లేదు. సేలం సమావేశం తర్వాతే శ్రీ అన్నాదొరై ఈ సంగతి గురించి స్పష్టంగా చెప్పారు. మరొక విధంగా చెప్పాలంటే, అప్పటి మద్రాసు రాష్ట్రం బయట తమిళులు, తెలుగువారు, మలయాళంవారు నివసిస్తున్న ప్రాంతాలని తమ 'రాజ్యం'లో చేర్చమని వారు కోరలేదన్న మాట. అసలు స్వాతంత్ర్యానంతరమే కదా భాషారాష్ట్రాలు ఏర్పడింది.

సేలం సమావేశం తీర్మానం సంస్కృతి, భాష వాటిని ఆధారంగా చేసుకుని ఏ కోరికనూ వెలిబుచ్చలేదు. అయినా, ఇది అమల్లోకి వచ్చిన నాలుగు సంవత్సరాలకి శ్రీ అన్నాదొరై 'తమిళు'డంటే 'ద్రావిడు'డే అన్నాడు.

వీటన్నిటిని బట్టి ఒకటి గ్రహించవచ్చు. 'ద్రావిడనాడు'ని కోరేవారి భావాల్ని సుస్పష్టమయినవి కావు. సరయిన ఆధారం ఏదీ కలదికాదు. పరస్పర విరుద్ధాంశాలు కలది. అయినప్పటికీ గమనించ తగ్గది.

ఒకటేమిటంటే, శ్రీ రామస్వామి నాయకర్ బ్రాహ్మణ ద్వేషంలో 'జాతి'కి ప్రాధాన్యం ఏర్పడింది. ఉత్తరదేశంలో ఉండే బ్రాహ్మణులే కాక బ్రాహ్మణేతరు లందరూ కూడా ఆర్యులయిపోయారు. అందరూ ద్వేషానికి అర్హులయ్యారు. కాంగ్రెసుపార్టీ ద్రావిడ ప్రజలని అణగదొక్కాలని చూసేవారి సాధనం కింద చూడతగినది.

శ్రీ రామస్వామి నాయకర్ ఉద్యమంలో కుల, జాతి, వర్గవిభేధాంకి ప్రాముఖ్యత వచ్చింది.

'ద్రావిడనాడు' తీర్మానాన్ని జస్టిస్ పార్టీలోని కొందరు అరవవారు మాత్రమే బలపరచారని ఇక్కడ చెప్పాలి. ఇతర భాషల వారు కొందరు తమిళులు దానిని ఎదిరించారు కూడా. అది గెలిచిందంటే తీవ్ర తమిళ భాషాభిమానులు ఒక విజయం సాధించారనే కదా అర్థం?

జస్టిస్ పార్టీ పేరు "ద్రావిడ కజగం"గా మారిపోయింది. కొందరు అల్పసంఖ్యాకుల వర్గం విడిపోయి జస్టిస్ పార్టీని పునరుద్ధరించాలని ప్రయత్నించారు. కాని వారి ఆశయం సిద్ధించలేదు. అనతికాలంలోనే జస్టిస్ పార్టీ నశించింది.

"ద్రావిడనాడు" వివాదానికీ ముస్లింలీగ్ వారి "పాకిస్తాన్" వివాదానికీ చాలా పోలికలు ఉన్నాయి. ఇవి రెండూ ఇంచుమించు కలిసి వచ్చాయంటే అది కాకతాళీయం అవటానికి వీలులేదు. సామ్రాజ్యవాదులు అపవరణ సిద్ధాంత సృష్టికి ఎంతదాకా బాధ్యులో చెప్పటం కష్టంకాని, ఈ వివాదాలు పుట్టటానికి మాత్రం వారి భేదోపాయమే తోడ్పడిందని నిస్సందేహంగా చెప్పవచ్చు.

(సశేషం)

# 'పెప్సొడెంట్ యొక్క ఇరియమ్ ప్లస్

## మీ పళ్లను శుభ్రపరచి
## మెరిసేలా తెల్లగా చేస్తుంది

ఎలాగో చూడండి : పెప్సొడెంట్‌లో మాత్రమే అద్భుతమైన నురుగును యిచ్చే శాస్త్రపద్ధతిలో తయారైన ఇరియమ్ ప్లస్ చేర్చబడినది. ఈ అద్భుతమైన నురుగు సమృద్ధిగా కలిగి మీ నోటిలో అన్ని మూలలకు చేరి పళ్లను శుభ్రముగా, చల్లగా, పెప్పర్‌మింట్ రుచితో ఉంచుతుంది. అంతేకాదు, మీ పళ్లను మెరిసేలా తెల్లగా చేయుటకు ఇరియమ్ ప్లస్‌కు తెల్లదనమునిచ్చే ప్రత్యేకమైన శక్తికూడ ఉంది.




హిందూస్తాన్ లీవర్
లిమిటెడ్ వారి
ఒక విశిష్టమైన తయారు.

[SWT-HDL-4990




జరిగిన కథ

ఆమ్రపాలి అందచందాలను గురించి విన్న మగధరాజు బింబిసారుడు ఆమె నెట్లాగైనా తన దాన్ని చేసుకోవాలనే ఉద్దేశ్యంతో సంజయుడు, మరికొంతమందితో కలిసి వైశాలీ నగరంలో పుత్తళికల వ్యాపారుడుగా ప్రవేశిస్తాడు. దేవా అదేశానుసారం పాలి భవనంలో ప్రవేశిస్తాడు పుత్తళికల వ్యాపారుని వేషంతో ఉన్న బింబిసారుడు. ఆ కిన్న కుడుగు పుత్తళికల వ్యాపారునిపైన పాలి దృష్టి పడుతుంది. బింబిసారుడు నేర్పుతో ఆనందుడనీ, పాలిని ఆపదనుంచి తప్పిస్తాడు. పాలి, బింబిసారుడు ఉద్యానవనంలో కల్సుకుంటారు. ఇరువురిహృదయాలలో ప్రేమ అంకురిస్తుంది.

## 8

పాలి ధ్యానం భగ్నమైంది. ఆమె కొంచెం సంకుచిత అయి అత్యంత సమీపంగా వచ్చిన బింబిసారునితో అంది—'నన్ను పొగడ్డం, ముగించావని నేను అనుకున్నాను. కాని నన్ను పొగడడానికి ఇప్పు డారంభిస్తున్నావు!' బింబిసారుడు ఇంకా సమీపంగా వచ్చాడు. అతడు ఒక రకం ఉన్మాదం చేత ప్రేరితుడయ్యాడు.

అతని కంఠం మారింది.—'ఆమ్రపాలి కొరకు సంవత్సరాల నుండి మాటలు వింటూ వున్నాను. పాలి సాటిలేంది, అలౌకికురాలు అని ప్రజలు నాతో చెప్పేవారు. ఆమ్రపాలి సౌందర్య ప్రశంస ప్రతి వాయుతరంగంలోనూ వినిపిస్తుంది. ఈ విషయాన్ని గురించి వాద వివాదం చేసిన తరువాత ఇద్దరు క్షత్రియ కుమారులు పోట్లాడడం చూచి నాకు నవ్వు వచ్చింది. నేడు నాకు నన్ను గురించే నవ్వు వస్తోంది. పాలిని గురించి ఎంత చెప్పినా, అది అసంపూర్ణమని నేడు తెలిసింది. ఇప్పుడంతా పాలిని చూచిన వెనక నాకా తక్కువ అనిపిస్తుంది.'

'తక్షశిలలో సాహిత్యమును ప్రధానముగా అభ్యసించలేదు కదా' అని బింబిసారుని ఎంత మొండి దూరంగా తొలుగుతూ పాలి అంది. 'కవిత్వాన్ని చూచి విద్యావిహీనుడు కూడా కవిత్వంతో నిండిపోతాడు.'

'అయితే నీవు రాజకుమారుడవు కావు. రాజకుమారులు విద్యావిహీనులు కారు.' పాలికి మళ్లీ పరిహాసం స్ఫురించింది. కాని బింబిసారుని స్థితి అలాలేదు. అతడొంటరిగ ఉన్నాడు. సమయం కూడా తక్కువగా ఉంది. వెనకటి ఉన్మత్తావస్థలోనే అతడు ముందుకు సాగుతూ పోయాడు. అతడన్నాడు. 'నా దేశం నుండి బయలుదేరినప్పుడు రెండు ప్రతిజ్ఞలు చేశాను. ఒకటి, పాలిని చూడనిదే తిరిగి రానని. రెండవది, పాలిని చూచిన వెనక ఇక్కడ ఉండనని. కాని నిజమేమంటే, నేనిప్పుడు తిరిగిపోయే శక్తిని పోగొట్టుకున్నాను. నేను పరాజయం పొంది ఎరగను. ఇక్కడ ఉండి కూడా ఓడిపోయి వెళ్లను. ఇక్కడ మూడురోజులుంటాను. నా ప్రతిజ్ఞకు ఫలితం ఏమవుతుందో చూస్తాను.'

'అతిథీ, ఎవడైనా లిచ్ఛవీయుని నిశ్చయం ఎన్నడైనా వినియున్నావా? మాగధీయుణ్ణి ఎవడ్నైనా అడిగి చూడు.'

'నాకు లాభం ఉంటే మగధరాజునైనా అడగడానికి సందేహించను.'

'మాగధీయులు మాకు శత్రువులు. మాకు స్నేహితుడవై వాళ్లను కలిశావా, నిష్కారణంగా మృత్యుముఖంలో పడవలసి వస్తుంది.'

'ఓహో! అసత్యం, మాగధీయుల్ని నేను బాగా గుర్తిస్తాను.'

'లిచ్ఛవీయుని కంటే బాగానా?'

'అవును, నేను తోలుబొమ్మ లాడించే వాడనని మరచావా? మనుష్య స్వభావాన్ని గుర్తించడం మా మొదటి పని. నాకు మాగధీయునితోనూ, లిచ్ఛవీయునితోనూ ఏమీ భేదం కన్పించడం లేదు.'

'అతిథికి అపకారం చేయడం పాపం. దయచేసి మాగధీయులతో మమ్మల్ని పోల్చకు. వాళ్లు మాకు శత్రువులు.'

'శత్రువులుగా చేయబడ్డారా? లేక తలంపబడ్డారా?' జాతీయాభిమానంతో అతిశయించిన పాలిని శాంతింప చేయడానికి బింబిసారు డడిగాడు.

పాలి ఉలికిపడి బింబిసారుని చూచింది. కోపంతో ఆమె అంది. 'నీవు ఇప్పుడు మాగధీయునిలా అగపడుతున్నావు.'

'నిజంగా అయితే?'.........

'అతిథివి కాబట్టి ప్రాణాలుంటాయి. లిచ్ఛవీయుల ప్రవేశ పుస్తకంతో ఉపకారానికి బదులు మృత్యువు కాదు..కాని నీవు మాగధీయుడవు కావు....'

'సీమోల్లంఘనమైంది.'

బింబిసారుని నోటివరకూ వచ్చిన మాటలు పాలి అంతిమ వాక్యాన్ని విని అక్కడే ఉండిపోయాయి. అతడు స్వస్థత పొందాడు. ఇతరులకు ఈర్ష్యను కలిగించే మాగధీయుని గర్వానికి బదులు అతని ముఖంలో దోషరహితమైన చిరునవ్వు చిందులాడ సాగింది. వాతావరణంలో ప్రచ్ఛన్న కాఠిన్యం స్వయముగా తగ్గిపోయింది. అతడు మెల్లగా అన్నాడు. 'నీ మాట నిజం. మూడు రోజులు అయిన తరువాత నేనెవణ్ణో చెప్తాను.'

అతిథి సారళ్యం, చిత్తవిభ్రమాన్ని కలిగించే మందహాసం చేత పాలి ఓడిపోయింది. అతిథికి కటువచనం వినిపించడానికి ఆమె సిగ్గుపడింది. ముందుకు సాగకుండానే ఆమె మృదుస్వరంతో అంది. 'మూడు దినాల తరవాత నీవు చెప్పనవసరంలేదు. నీ వెవడవో నేనే చెప్తాను.........'

బింబిసారుడు చాలా దగ్గరకు వచ్చాడు. 'ఇప్పుడే చెప్పకూడదా, నేనెవణ్ణో!'

'అతిథి' అని పాలి జవాబిచ్చింది. అంత వాళ్లిద్దరూ ఆ ప్రేమ మార్గంలోని పథికుల రూపంలో ఒకరినొకరు చూస్తూ ఉన్నారు.

* * *

వైశాలీ నగరానికి ఉత్తరంగా ఉన్న రాజమార్గానికి అనతి దూరంలోనే వైశాలిలోని యువకుల ద్యూతగృహం ఉంది. దాని సమీపంలోనే మధుశాల కూడా ఉంది. తరచు సంధ్యవేళ ద్యూతం ఆరంభం అవుతోంది. కాని ఎప్పుడైనా రసికుడైన పరదేశి ఎవడైనా వస్తే, నియమ విరుద్ధంగా మధ్యాహ్నము నుండే ప్రారంభమవుతుంది. నేడు

తర్వాత జరిగింది. శ్రావస్తి నుండి కొందరు వణిక్యువకులు లిచ్ఛవీయులతో జూదమాడ్డానికి వచ్చారు. వాళ్ళు లిచ్ఛవీయుల చేత గట్టి ఓటమిని పొందారు. ఇరుపక్షాలవారూ రసికులవడం వల్ల లిచ్ఛవీయ ఆటగాళ్ళు పరదేశుల్ని ద్యూత గృహం నుండి తిన్నగా మధుశాలకి తీసుకుపోయారు.

అమావాస్య రాత్రి. మధుశాలలో దీపాలు వెలుగుతున్నాయి. నేడు అకస్మాత్తుగా వైశాలీ నగరపు సురాధ్యక్షుడు రావడంవల్ల దీప కాంతితో పాటు నలువైపులా సుగంధం కూడా వ్యాపిస్తోంది. సుగంధిత తైలం పూరికి మండడం చూచి మధుశాల యజమాని శంభుని సంకీర్ణ హృదయం మండుతోంది. ద్యూతగృహానికి రసికులు రావడం వల్ల అతని ఆనందానికి మేర లేకుండా ఉంది. వాళ్ళు ద్వారం దగ్గరికి రావడానికి ముందే అతడు తొందరపడ్డాడు. దుర్భాషులవడంవల్ల అతనికి కోపించడానికిగాని, కోపం చూపించడానికి గాని ఎంతో కాలం పట్టడం లేదు. ధనవంతుడెవడైనా అక్కడకు వస్తూండడం చూచి నౌకర్ల మీద పెత్తనం చలాయించడానికి అతడు ఆతురపడతాడు. త్రాగుబోతుల దృష్టిలో అతడు హాస్యాస్పదుడుగా కన్పించినా, దీన్ని అతడు తన మద్యం అమ్ముకోడానికి ఒక సాధనగా తలుస్తున్నాడు.

కారణంలేని ఈ తత్తరపాటుకి నౌకర్లు అలవాటు పడ్డారు. వాళ్ళు తమ పనిలో మునిగిపోయారు. మిశ్రిత లోహాలతో తయారైన అందమైన పాత్రలతో మద్యం ఇవ్వబడింది. ప్రతి యువకుడూ ఏదో ఆలోచిస్తూ మదిరా పానానికి ఉపక్రమించాడు.

నిషా ఎక్కగానే రసికుడైన పరదేశి ఒకడు తనదగ్గర కూర్చున్న ఒక లిచ్ఛవీయ యువకుడితో అన్నాడు. 'ఏమి మిత్రమా, అంబట్టా, పాలిని ఎప్పుడు చూపిస్తారు?' పాలి పేరు వినగానే దాదాపు అందరి దృష్టి ఆ పరదేశి వైపు పోయింది. అంబట్టుడు కొంచెం సంకోచించాడు. పరదేశి తను అనుకున్నది చెపుతూనే ఉన్నాడు. 'మూడు రోజులనుండి ఆమెను చూడడానికి ప్రయత్నిస్తున్నాను. కాని ఏమీ తెలియడంలేదు మిత్రమా. పాలిని తీసికొని కాని పోననీ, తీసికొని పోవడమేకాదు పెళ్లాడతాననీ, షరతు పెట్టి వచ్చాను......'

పరదేశి యీ వాక్యాలు అగ్ని కంటె కూడా అధికంగా దహించేవిగానూ, ఘృతం కంటె అధికంగా ఉత్తేజితంగానూ ఉన్నాయి. ప్రతి లిచ్ఛవీయుడూ విస్ఫారిత నేత్రాలతో ఆ పరదేశిని చూడసాగాడు. పరదేశి వాళ్ళని ఉపేక్షించి నవ్వుతూ సురాపానం చేస్తున్నాడు. ఆ సమయంలోనే అతని భుజం మీద ఒక చేపెట్టుపడింది. అతడు అదుకొనే లోపునే అతణ్ణి పట్టుకొన్న వ్యక్తి అతణ్ణి కిందకు తోసి రొమ్ము మీద కూర్చున్నాడు. అతడు సుధీరుడు........

'లేచి నిలబడు, సుధీరా' అని ముగ్గురు యువకులు సుధీరుణ్ణి పరదేశి మీద నుంచి తప్పసాగారు. కాని పరదేశి కూడా సామాన్యుడు కాడు. సుధీరుని ఈ పెనుగులాటలో అతడు నేర్పుతో నిలబడి సుధీరునితో కలియబడ్డాడు. ఈసారి పరదేశిది పైచెయ్యి. అతనికి సరియైన ఉజ్జీ లభించింది. కొద్ది క్షణాలలోనే మద్యపాత్రలూ, ఎల్లలూ ఎగర సాగాయి. సుధీర పరదేశుల ముష్టి యుద్ధం చూడతగిందిగా ఉంది. చివరకు సుధీరుడే గెలిచాడు. ఇద్దరి శరీరాల మీదా లోతైన గాయపు గుర్తులు పడ్డాయి. కావలసి



కొంత పెనుగులాట అయ్యాక రెండుపక్కాల వాళ్లూ కలిసి ఇద్దర్నీ విడిపించారు. పరదేశి ఎక్కువగా గాయపడ్డాడు. బలిష్టులైన ఇద్దరు యువకుల చేత పట్టుబడి ఉన్న సుధీరుడు ఒగరుస్తూ ఇలా చెప్పసాగాడు. 'పాలిని ఈ పరదేశి తీసుకుపోతాడా? లిచ్ఛవీయుల రాజధాని అయిన వైశాలినుండి పాలిని తాకడానికి ముందే ఇతని చేతులు ఖండితాలై క్రిందపడతాయి.'

'సమయం వచ్చినపుడు ఇది చూస్తాం' అని ఒకమూల కూర్చున్న మాలవ నివాసి సురాపానం ఆపి అన్నాడు. అతడు ఇంత వరకూ శాంతంగా కూర్చుని ఈ ఆట చూస్తున్నాడు. అతడన్నాడు—

'పాలిని వివాహ మాడడానికి నిశ్చయించిన యువకుడు సామాన్యుడు కాలేడు....'

'కాదు, అతడు సామాన్యుడు కాలేడు. దీని కర్థం అతడు లిచ్ఛవీయుని వంటివాడు కాలేడని.'

'నిజమే, ఈ పరదేశి లిచ్ఛవీయుని కంటె కూడా ఎక్కువ బలశాలి అయి ఉంటాడు. అయితే పాలిని వివాహం ఆడగలడు కదా' అని మాలవ నివాసి మద్యాన్ని గుటక వేసి అన్నాడు. ఇలా అని అతడు నవ్వి మద్యపాత్రను నోటికి తగిల్చాడు. అతని స్పష్ట వచనాలలో రవంత మాత్సర్యం ఉంది. వీరభద్రుడనే యువకుడు ఇది సహించలేక పోయాడు. రెండడుగులు ముందుకు వేసి అతడన్నాడు—

'లిచ్ఛవీయుని బాణాలూ, కత్తి గాని శాస్త్రంగానీ యెదుర్కొని ఈ విషయాన్ని నిరూపించగలవు.'

'తప్పకుండా...' పాత్రలోంచిపూర్వం లాగ ఒక గుక్కెడు మద్యాన్ని మింగి ఆమాలవీయుడన్నాడు 'పరదేశి లిచ్ఛవీయునికంటె

# ఆమ్రపాలి

ఎక్కువ బలశాలి...'

ఇది విని వీరభద్రుడి కళ్లు నుదిటి పైకి పోయాయి. రెండడుగులు వేసి అతడన్నాడు: 'వైశాలిలో మహాపరాధం ఏదో చేస్తేకాని మేము పరదేశి ప్రాణాలు తీసుకోము.'

'లేకపోతే నా ప్రాణాలు తీస్తారు. గాబోలు, ఇంతేనా? కాని నీవు పొరబడుతున్నావు. ప్రకృతి కేవలం వైశాలిలోనే సమస్త శౌర్యాన్నీ, బలాన్నీ నింపలేదు. ఇతర దేశాల్లోనూ నింపింది.' ఇలా అని మాలవీయుడు మరో గుక్కెడు తాగి పాత్రను బల్ల మీద ఉంచడానికి చెయి చాపాడు. కాని బల్లను అంటడానికి ముందే ఒకకత్తి ఖంగుమంటూ అతని చేతి దగ్గరపడింది. వెంటనే ఎవడో అరచాడు. 'అయితే ఇప్పుడే చూడు!' మాలవీయుడు కళ్లెత్తి చూశాడు. కత్తి వేసి ఆహ్వానించేవాడు వీరభద్రుడే. మాలవీయుడు పాత్రను రివ్వున బల్ల మీద విసిరికొట్టి వీరభద్రుని వైపు చూశాడు. మళ్లీ పాత్ర ఎత్తి ఆఖరి సారి గుక్కెడు నోట్లో ఒంపుకున్నాడు. నోరు తుడుచుకొని కత్తి పట్టి నిలబడ్డాడు. అతడు నిలబడగానే అతడి దేహం ఎంత విశాలంగా ఉందో అందరికీ తెలిసింది. శంభుని కళ్లు ముడుచుకున్నాయి. నాలిక దవడని అంటుకుపోయింది. మాటలాడడానికి ఎంత యత్నించినా పెదవులు తెరవబడేలేదు.

వీరభద్రుడు సామాన్య యోధుడు కాడు. అతడు గర్వంతోటీ, ఉపేక్షతోటీ మాలవీయుణ్ణి చూస్తున్నాడు. యోధులిద్దరూ ఒకరి సమక్షానికి ఒకరు వచ్చారు. యుద్ధప్రియులైన లిచ్ఛవీయ యువకులు కుతూహలంతో ఆ యోధుల్ని చూడడానికి వర్తుల ప్రదేశంలో నిలబడారు. మెరపు మెరసినట్లు వీరభద్ర మాలవీయులు ఇద్దరూ ఒకనిపై ఒకరు విరుచుకుపడ్డారు. వీరభద్రుడు చపలుడు, చురుకైనవాడు. మాలవీయుడు బలిష్టుడు, భయంకరుడు. ఇద్దరూ ఒకర్ని ఒకరు కొడుతూ, ప్రహారాల్ని సహిస్తున్నారు. కొంతసేపటివరకూ మాలవీయుడు వీరభద్రుణ్ణి పిల్లల ఆట వస్తువులాగ తిప్పుతూ ఉన్నాడు. కాని అవకాశం చిక్కగానే వీరభద్రుడు సింహం లాగ దూకి విశాలకాయుడైన మాలవీయుని పొట్టలో కత్తి జొనిపి వేగంగా అక్కడి నుండి తొలగిపోయాడు. పైకి ఎత్తి ఉన్న మాలవీయుడి చెయ్యి క్రింద పడిపోయింది. వీరభద్రుడు మళ్లీ దుమికి కూర్చున్న మాలవీయుని గుండెలో ఒక్కసారిగా కత్తితో పొడిచాడు. శంభుని పెదాలు విడివడ్డాయి. అతడు కెవ్వుమన్నాడు. తక్షణం మరో పరదేశి వీరభద్రుని మీదికి దూకి కత్తితో ఒక్క పెట్టు పెట్టి అతణ్ణి దీర్ఘనిద్ర పుచ్చాడు. తరువాత....సుధీరుడు వీరభద్రుణ్ణి చంపినవాని మీద పడ్డాడు. తక్కిన లిచ్ఛవీయులు కూడా కత్తి దూసి ముందుకు సాగారు. పరదేశులు సిద్ధంగానే ఉన్నారు. ఒకర్ని ఒకరు అంతం చేయసాగారు.

శంభుడు పిచ్చివాడిలా ఉరకసాగాడు. తన ప్రాణాల్ని కాపాడుకోడానికి అతడు ఇటూ ఆటూ పరుగెత్తసాగాడు. నౌకర్లని ఆజ్ఞాపించడానికి బదులు వాళ్లని ప్రార్థించడం మొదలు పెట్టాడు. యోధుల్ని ప్రార్థించడానికి బదులు వాళ్లని బెదరించడం మొదలెట్టాడు. కొంచెం తెలివి రాగానే పెద్ద గాయాలు తగిలినట్టు కేక వేసి నౌకర్లను పిలవసాగాడు. గడచిన ఇరవై ఏళ్లల్లో అతడు తన మధుశాలలో కేవలం వాగ్యుద్ధాన్నే చూశాడు. కాని ప్రాణహాని కలిగించే— ఇంతమంది ప్రాణులికి హాని గలిగించే— యుద్ధాన్ని చూడలేదు. ఇది అతని జీవితంలో ఎంతమాత్రం ఎరగని విషయం. తన దుకాణం నష్టమైపోతోందని అతనికి అనిపించింది. అతని అతిశయ క్రోధం, గట్టి అరపులూ తుదకు కన్నీళ్లయి చెక్కిళ్ల మీద ప్రవహించ సాగాయి. దీనివల్ల కూడా తనకు లాభంలేదని తలపాగా పెట్టుకొని మూర్ఛలో మునుగుతూ పారిపోయాడు.

ఈ సమయంలో ఒగర్చుకుంటూ చిరంజీవి అక్కడికి వచ్చి ఉండకపోతే పాలి కోసం ప్రపంచాన్ని అంతా నాశనం చేసే ఉన్మాదంతో సుధీరుడు స్వయంగా పరదేశుల చేతు



లో నశించి ఉండేవాడే

మధుశాలలోని అల్లరి విని సమీప గ్రామంలోని వ్రడంగులు, నటకులు తమ నాయకుల్ని తీసుకొని అక్కడికి పరుగెత్తుకొని వచ్చారు. చిరంజీవిని చూచి అనేక మంది నాయకులు రెండు పక్షాల వారినీ శాంతింప చేయడానికి చేతికందిన వాణ్ణి గట్టిగా పట్టుకున్నారు. కొన్ని గాయాలు



తగిలాయి కాని నాయకులూ, చిరంజీవీ చివరికి సఫలులయ్యారు. అందరి కోపం శాంతించింది. కారణమేమంటే, చిరంజీవి ఒక ఒకటొకటిగా ఎనిమిది శవాల్ని అందరి మధ్య తెచ్చి ఉంచాడు. ముగ్గురు లిచ్ఛవీయులూ, అయిదుగురు పరదేశులూ చంపబడ్డారు.

అందరూ కొట్టబడ్డారు.

ఆ సమయంలో ఏడుస్తున్న శంభుడ్నీ వైశాలి పురాధ్యక్షుడు, పరదేశ వ్యాపారుల దగ్గర నుండి పన్ను వసూలుచేసే శుల్కాధ్యక్షుడు, అంగరక్షకులు, విదేశీ సంఘ ప్రధాన సార్థవాహాలతో కూడా అక్కడికి వచ్చారు. త్రాగి ఉన్మత్తులై ఉన్న యువ

**పాలికి జరిగినదంతా అప్పుడు తెలియ వచ్చింది.**

నగర సంరక్షకుడు దీర్ఘాలోచన చెయ్యకుండా గాయపడ్డ వాళ్ళని నగర చికిత్సాలయానికి పంపించాడు. సార్థవాహుని ఇచ్ఛానుసారం పరదేశుల శవాల్ని నగరవ్యయంతో అంతిమ సంస్కారానికై పంపించాడు. లిచ్ఛవీయుల శవాల్ని పూర్వాచార ప్రకారం పశుపక్ష్యుల ఆహారానికై నగరానికి వెలుపల ప్రకటంగా ఉంచడానికి పంపాడు.

గణికాధ్యక్షుడు క్షపణకుని తమ్ముడు, కూడా చనిపోయిన లిచ్ఛవీయుల్లో ఒకడై ఉన్నాడు. క్షపణకుడు తన సోదరుడి చావును సరళంగా మరచేటంత ఉదారుడు కాడు. ఒక ఆడదాని కోసం ఇంత భీషణ యుద్ధంలో దూకే యువకుల్ని చూచి అతడు అసూయపడతాడు. కేవలం పాలి కోసం ఒక జీవితం ధూళిలో కలవడం చూచి అతడెంతో క్షోభిస్తాడు. సోదరుడి మరణం అతని కోపాన్ని ఇనుమడింప జేసింది. అంత్యక్రియలు చేసిన తరువాత అతడు చుట్టుపక్కల ఉన్న నాయకుల్ని పిలిచి వాళ్ళతో గుప్తంగా ప్రసంగించాడు. కొంత నిశ్చయమయ్యాక అతడు అందర్ని వెంట పెట్టుకొని రాత్రే నగర శ్రేష్ఠి మహలు చేరాడు.

పాలి కోసం యుద్ధమవడం కొత్త విషయం కాదు. ఈ విషయం విద్యుద్వేగంతో నగరంలో వ్యాపించింది. ఈ పాత వింత పట్ల అందరూ తమ మచ్చరాన్ని ప్రదర్శించారు. వాళ్ళల్లో నగరశ్రేష్ఠి ఉన్నాడు. కాని నగరశ్రేష్ఠి నవ్వు చాల కాలం ఉండలేకపోయింది. క్షపణకుని పెరుగుతున్న కోపం చూచి అతడు విస్మితుడయ్యాడు. గణికాధ్యక్షుడైన క్షపణకుడికి ప్రత్యుత్తరం ఇవ్వడమంటే సామాన్యమైన పనికాదు. సంథాగారంలో అతని పిలుపు వినిపించిన మీదట అభయు డొక్కడే అతణ్ణి కిమ్మనకుండా చేయగలడు. పాపం నగరశ్రేష్ఠి వణికాడు. పరితప్తుడైన క్షపణకుణ్ణి ఎలాగో శాంతింపజేసి అతణ్ణి అభయుని ఇంటికి తీసికొని పోయాడు. ఇంతలో సమాచారమంతా అభయుడి కందింది. గూఢచారుల వల్ల విశేషాలన్నీ అతనికి తెలిశాయి. చివరికి అందరూ అతని దగ్గరకు రావలసి వస్తుందనే విశ్వాసం అతనికి ఉంది. వారంతా నగరశ్రేష్ఠి వెంట అభయుని మహలుకు వచ్చారు. సాధారణ మర్యాదలయ్యాక అభయునికి దగ్గరగా కూర్చుండగానే, క్షపణకుడు చెప్పడం ఆరంభించాడు.

'పాలిని గురించి నిర్ణయించండి.'

'కాని నేనెలా చేస్తాను?'

'మీరు చేయలేకపోతే ఎవరూ చెయ్యలేరు. వైశాలిలో ఉన్న కొద్దిమంది పూజ్యులైన వయోవృద్ధుల్లో మీలొకరు. లిచ్ఛవీయ దేశంలో నలుమూలల్లోనూ సాటిలేని అందకత్తెలున్నారు. కాని వాళ్ళల్లో ఏ వివాహిత స్త్రీకానీ, కుమారి కానీ పాలిలాగ వజ్రపాతం చెయ్యలేదు. ఒక స్త్రీ కోసం రణవీరులైన లిచ్ఛవీయ యువకుల్ని మూర్ఖుల్ని కానివ్వడమూ, ఒకర్ని ఒకరు నరకుకొని చావనివ్వడమూనా? ఇట్లెంత కాలం జరగాలి? మహానాముడు మన అందరిలోనూ వృద్ధుడు. మనం అతని ఆజ్ఞని ఉల్లంఘించగోరడంలేదు. కాని లిచ్ఛవీయులు కర్తవ్యం ముందు తమ్ము తుచ్ఛులుగా భావిస్తారు. ఈ సమయంలో మన కర్తవ్యం పాలిని గూర్చిన అంతిమ నిర్ణయం జరగాలనే ఒకే మార్గం చూపిస్తోంది. ఆమె సంథాగారానికి అధ్యక్షుడైన మహానాముడి కూతురే అవుగాక.'

వెయ్యిమంది గూఢచారులు వెయ్యి దినాలలోనైనా తేలేని అవకాశం అభయుడికి అనాయాసంగా జోడించి తన కాళ్ళపై పడ్డట్లు అతని కనిపించింది. ఈ ఆలోచనతో అతడొకసారి తనకాళ్ల వైపు కూడా చూశాడు. అతని హృదయం ఆనందం వల్ల నాట్యమాడ సాగింది. కాని ముఖంలో కొంచెం కూడా ఈ గుర్తు చూపించకుండా క్షపణకుణ్ణి ఉత్తేజపరచడానికి సార్థవాహ నగరశ్రేష్ఠుల వైపు దృష్టి సారించి శాంతంతో అతడన్నాడు.

'సోదరులారా, మీ మాటలు నిజమని ఒప్పుకున్నా, పాలి మీద నా అధికారం ఎట్లు సాగుతుంది?' 'సభాపతి మహానాముని మీద సాగుతుంది కద?' అని క్షపణకుడు అకస్మాత్తుగ గొంతెత్తి పలికాడు. మళ్లీ కొంత శాంతించి అన్నాడు—'మీ ఇద్దరూ మిత్రులు. అనేక సంవత్సరాల నుండి లిచ్ఛవీయుల రాజ్యభారాన్ని వహించారు. మీరు ఆమెకు నచ్చజెప్పాలి.'

'ప్రయత్నిస్తాను.'

'ప్రయత్నంకాదు, నిర్ణయించాలి.'

'మాటకు కట్టుపడలేము.'

'మహారాజా, పాలి ఒక్కరు కాదు, వంద కాదు, వేలకొలది యువకుల హృదయానికి నిప్పు పెట్టింది. గడచిన విషయాల మాట అలా ఉంచండి. ఆమె మూలంగా నేడు మన వాళ్ళు ముగ్గురూ, పరదేశీయులలో అయిదుగురూ యువకులు ప్రాణాలు కోల్పోయారు. కాని మీరే చూడండి. ముగ్గురు కొరకు ముప్పదిమంది, ముప్పది మంది కొరకు మూడువందల మంది లిచ్ఛవీయులు పాలి పెట్టిన అగ్నిలో నిరర్థకంగా మండుతూ కనిపించగలరు. ఇంక ఆలస్యం కాకుండా పాలి వివాహం జరగాలి. రాబోవు వైశాఖ పౌర్ణమికిపూర్వమే పాలికి వివాహంకాకపోతే...'

'కాకపోతే....?'

'కాకపోతే మహారాజా, నా ఏకైక సోదరుడు అరణ్యంలో నిద్రపోయి ఉన్నాడు. వైశాఖ పూర్ణిమకు ముందు పూజ్య మహానాముడు కాని, ఆనందుడు కాని పాలి కొరకు ఏ యువకుడినైనా ఎన్నుకొందురు గాక. లేదా, పౌర్ణమినాడు వేలకొలదీ యువకులు గ్రీష్మోత్సవానికి గుమిగూడతారు. స్వయంగా పాలి వారిలో ఎవరినో ఒకరిని ఎన్నుకోవాలి. మా అందరి తుది నిర్ణయం ఇదే.'

'ఇది కాకపోతే?' అని తెల్లని మీసాలు పెనవేస్తూ, సంకుచిత దృష్టి సారించి అభయుడు క్షపణకుణ్ణి అడిగాడు.

'అయితే మహారాజా, సంథాగారం ఉంది. మనమున్నాం. సమితి ముందు ప్రథమంగా ఈ ప్రశ్నే ఉంచబడుతుంది. పవిత్ర ప్రవేణి పుస్తకం మన ప్రశ్నకు ఉత్తరం ఇవ్వగలదు.

సరిగా అప్పుడే వయోవృద్ధుడైన మహానాముడు అభయుని ద్వారంలో కాలు పెట్టాడు. ఆ తుది వాక్యం చెవులలోంచి పోయి అతని హృదయాన్ని కాటు వేసింది. ధూర్తుడైన అభయుని అవకాశాన్ని గ్రహించి, నగరానికి సంబంధించి మిక్కిలి అవసరమైన రహస్యాలోచన కోసం మహానాముణ్ణి తన యింటికి రమ్మని ప్రార్థించాడు. అభయుడు తాను అస్వస్థుడుగా ఉన్నట్లు నటించడం వల్ల మహానాముడు అతని దగ్గరకు పోవలసి వచ్చింది.

వైశాలిలో భీష్మ సదృశుడైన వయోవృద్ధుడు అకస్మాత్తుగా అక్కడికి రావడం చూచి క్షపణకుడూ, నగరశ్రేష్ఠి కింకర్తవ్య విమూఢులై అక్కడే కూర్చున్నారు. క్షపణకుడేమీ మాట్లాడలేకపోయాడు. పరదేశియైన సార్థవాహుడు క్రోధితుడైన అవివేకిలా మాట్లాడక కూర్చున్నాడు. క్షపణకుడు ఒక్కసారిగా లేచి నిలబడ్డాడు. లంబోదరుడైన నగరశ్రేష్ఠి కూడా మెల్లగా నిలబడ్డాడు. ముగ్గురూ మహానాముడికి నమస్కరించి అక్కడ నుండి వెళ్లిపోయారు.

(సశేషం)

# వైజ్ఞానిక గాథావళి-67

-డాక్టర్




# దీని వల్ల ప్రయోజన మేమిటో? -ఫారడే-

వైజ్ఞానికులు ఏదైనా కొత్తసంగతిని కనుక్కున్నాము అని చెప్పినప్పుడు సామాన్య లిరులు అడుగుతారు "దీనివల్ల ప్రయోజన మేమిటీ?" అని. వైజ్ఞానికులకు ప్రయోగాలూ పరిశోధనలూ ఏదో ప్రయోజనము కోసము కానేకాదు. మన పరిసరములను గురించి చక్కగా తెలుసుకోడముకోసమే చేస్తారు వైజ్ఞానికులు తమ ప్రయోగాల్ని. అదివరకు తెలిసిన దానికంటే విశేష విజ్ఞానము ఏదైనా కొత్తది తెలిస్తే వారి ప్రయోగాలు సార్థకములే అని వారు సంతోషిస్తారూ, తాముకొత్తగా కనుక్కున్న సంగతుల్ని ఏవైజ్ఞానిక పత్రికలోనో ప్రచురిస్తారు.

ఒకవైజ్ఞానికుడి కృషికి సంబంధించంతవరకూ ఈప్రచురణయే ఆదర్శము. అంటే ఈప్రచురణమువల్ల చేకూరే కీర్తియే అతని లక్ష్యమని ఉద్దేశ్యముకాదు. కనుక్కోదలచుకున్నది కనుక్కోడమూ ఇతరులకు చెప్పడమూ అని. ఇలా తెలిసిన సంగతులనించి వారు ఊహాపోహలు చేసి, కొత్తప్రయోగాలు చేసి, ఇంకా కొత్త సంగతులు కనుక్కొని చెప్తారు. ఇంకొకరెవరో ఈవిజ్ఞానాన్ని ఉపయోగించి ప్రయోజనకరమైన యంత్రమో, మందో, సౌకర్యమోనిర్మిస్తాడు. అది నవవిజ్ఞానము సాధించిన ప్రయోజనమే అయినప్పటికీ నవవిజ్ఞాన లక్ష్యము మాత్రమదికాదు. విజ్ఞానానికి ఉపయోగము ఏర్పడవచ్చుగాక. లక్ష్యము కాదు.

ఫారడే1821 లో కనుక్కున్న విద్యుదయస్కాంతవిచిత్రాలు-ఈసత్యాన్ని చక్కగా సూచిస్తాయి. ఆ కథ తెలుసుకో డానికి ఆయిర్స్టెడ్ 1819లో కనుక్కున్న చిన్న విచిత్రముతో ప్రారంభించాలి. వోల్టావిద్యుత్ ఘటము (Battery) తెలిసిన తర్వాత విద్యుత్ప్రవాహమును పంపే ఈ నవీన సాధనముఅంతకుముందు చెణుకులు కల్పించే లైడెన్ జాడీని వెనక్కి నెట్టించిది. ఆయిర్ స్టెడ్ కోపెన్హేగెన్లో భౌతిక శాస్త్రాచార్యుడు. విద్యుత్తుకీ అయస్కాంతత్వానికీ ఏదోబంధముఉండాలనిఅతని అనుమానము. సజాతీయ వికర్షణా, విజాతీయ (Unlikes) ఆకర్షణా ఈ రెండింటా ఉన్నాయి. అతడు అయస్కాంతపు సూదికి కొంచెము పైన, అసూదికి సమాంతరముగా ఒకరాగితీగను పట్టుకుని దానిలోంచి బేటరీచేత విద్యుత్ప్రవాహాన్ని పంపేడు. అయస్కాంతపుముల్లు ఉత్తర దక్షిణాలు చూపిస్తూ వేలాడు తూండి సది దానిపై తీగలో విద్యుత్తు ప్రవరించగానే అయస్కాంతపుముల్లు యొక్క ఉత్తరపు కొన (North pole) విద్యుత్ప్రవాహ దిశకు ఎడమవైపుకి నెట్టబడి పట్లు తిరిగింది. ఈసంగతి ప్రచురణ అయింది. వారము పది రోజులలో ఆంపియరు అన్న ఫెంచి భౌతిక శాస్త్రజ్ఞుడు పై అయస్కాంతపు ముల్లుకి బదులు విద్యుత్తు ప్రవహించడానికి వీలైన లోహపు తీగను అమర్చి ఈ ప్రయోగమే చేశాడు. రెండు తీగలలోనూ విద్యుత్ప్రవాహము ఒకేదిశకు ప్రసరిస్తే ఆరెండుతీగలూ ఆకర్షించుకున్నాయీ, విద్యుత్ప్రవాహము వ్యతిరేకముగా వుంటే అతీగలు వికర్షించుకున్నాయి. ఆంపియరు తన దారినితాను ఇతర పరిశోధనలు చేసి ఈసూత్రము నుపయోగించి విద్యుత్ప్రవాహ బలాన్నికొలవగల సాధనము తయారుచేశాడు. అదివేరే కథ. ఆయిర్స్టెడ్ కనుక్కున్న ఫలితము నుపయోగించీ కూడా గాల్వానామీటరు అనే విద్యుద్బల సూచిని నిర్మించారు.

ఫారడే లండన్లోని రాయల్ ఇన్స్టిట్యూషన్లో విద్యుత్ పరిశోధనలుచేస్తూ, "విద్యుత్ప్రవాహమునడిచే తీగచేరువన వున్న అయస్కాంతపు ముల్లును నెట్టేశక్తి, ఆ అయస్కాంతమును అటు నెట్టుతూ విద్యుత్తీగను ఇటునెట్టాలి కదా?" అని ఆలోచించాడు. "తీగను పట్టుకుని ఉండడము వల్లకదా అది కదలక ముల్లు కదిలింది?— తీగని కదలడానికి వీలుగా అమర్చి, అయస్కాంతాన్నే బిగిస్తే, ఆ తీగ-- విద్యుత్తు ప్రవహించే తీగ— కదలాలి కదా?" అని అతని ఆలోచన. దీన్ని సోదా చూడాలని చక్కని అమరిక చేశాడు అయస్కాంతానికీ తీగకీని.

పటములో సగానికి కోసి తిరగవేసిన సీసాలో నిడూగుని 'అకా' అన్న అయస్కాంతమమర్చాడు. దానిలో 'పా'దరసము పో శా లు బేటరీనుంచి తీగలు



## వైజ్ఞానిక గాథాశతి

తెచ్చి ఒకటి అయస్కాంతము దిగువ కొనకీ, రెండోది 'రాతి' అన్న కడ్డీద్వారా ఒక తిప్పని రాగి'తీగ' పై కొనకీ కలిపేరు. ఆరాగి తీగ దిగువకొన 'పాదరసము'లో మునిగివుంది. ఇప్పుడువిద్యుత్తు బేటరీనుంచి 'రా', 'తి', 'గ', 'ఆ' ద్వారా పాదరసములోంచి అయస్కాంతానికీ, దాని దిగువకొన నుంచి మళ్ళీ బేటరీకీ అందుతుంది. 'తీగ' లోంచి విద్యుత్తు ప్రవహిస్తోంది, తీగ బిగించిలేదూ, అయస్కాంతము బిగించివుంది. కనక ఫారడే వూహ ప్రకారము తీగ జరగాలి. వాస్తవానికీ ఆతీగ పాదరసములో అయస్కాంతానికీ ప్రదక్షిణాలు చేసింది. "దీనికి ప్రయోజనమేమిటి" అని ఫారడేనడిగితే, "కొత్తగా పుట్టిన బిడ్డకి ప్రయోజనమేమిటి?" అని అడిగేడంటారు.

దాని వంగతినలాగవుంచి, యాంత్రికులు ఆవూహని పెంచిన వైనం చిత్రంగా వుంటుంది. "అయస్కాంతం దగ్గర విద్యుత్ప్రవాహమున్న తీగవుంటే, కదుల్తుంది. ఏటు కదులుతుంది? దాని పొడవుకి లంబముగా కదులుతుంది. పటమ్లోలాగా రెండు చక్రాల ఇరుసుకి సింగాణి పూత పెట్టిన తీగచుట్టేరు. ఆతీగలో విద్యుత్ప్రవాహము విడమవేవు 'క' దగ్గర ప్రవేశించి, "క త య వ అ మ న గ రి వ ని ధ డ జ చ" అన్నతీగపొడవంతా ప్రసరించి 'చ'దగ్గర నిర్గమిస్తుంది. 'ఉ' 'ద' అన్నవి అయస్కాంతపు ఉత్తర దక్షిణ ధ్రువాలు. విద్యుత్తు ప్రవహించే తీగలు— ఎడమ వైపుకి విద్యుత్తు ప్రవహించేవి మనకి విముఖంగానూ, కుడివైపుకి విద్యుత్తు ప్రవహించేవి మనవైపున్నూ—కదులుతాయి. ఈ ఇరుసు, చక్రాలతోపాటు కుడివైపు బాణము సూచించేటట్టుగా తిరుగుతుంది.

ఇరుసుకి ఇంకోచక్రము అమరిస్తే ఆ చక్రానికి బెల్టుబిగించి ఏపిండిమరో, ట్రాము చక్రమో, ఫేను ఆకులనో గిర గిర తిప్పవచ్చును. ఈ సాధనమే 'ఎలక్ట్రికు మోటారు'; అయిర్‌స్టెడ్, అంపియర్, ఫారడేల పరిశోధనల ఫలితంగా ఎలక్ట్రిక్ మోటారు నిర్మాణము సాధ్యమైనప్పటికీ పరిశోధనల లక్ష్యము మటుకు మోటారు నిర్మాణము కాదు. ●

# మీ భవిష్యత్తు





నేటి యువకులు వివేచనతో కొంటారు - వాళ్లు కొనే టూత్‌పేస్ట్ ఎపిక్-ఎందు కంటే ఎపిక్ పళ్లను శుభ్రంగా తెల్లగా ఆరోగ్యవంతంగా ఉంచుతుంది. శ్వాస తాజాగా సువాసనగా ఉంటుంది. నేటి సంసిద్ధులైన యువకులు స్త్రీలు పురుషులు కూడా అనాటెంకించి అనారు ఎక్కువగా ఎపిక్‌నే వాడుతున్నారు-ఎందుకంటే వారికి దంతముల ఆరోగ్యమునుగూర్చి బాగా తెలుసు. మంచి ప్రకాశవంతమైన సంసిద్ధవంతమైన భవిష్యత్తుకు ఎపిక్‌ను వాడండి. హెక్సాక్లోరోఫిన్ కూడిన ఎపిక్ దంతములకు సంపూర్ణముగు చిరమైన ఆరోగ్యమును కలిగించును.

## ఎపిక్

భారతదేశపు ప్రప్రథమ

హెక్సాక్లోరోఫిన్

టూత్‌పేస్ట్ & టూత్ పవుడర్







ఓరియంటల్ ఫార్మా ప్రైవేట్ లిమిటెడ్ మద్రాసు 43

ajanta OPE/65-2 TG A

# నిరుద్యోగపర్వం



## మూడవ కథ : యమసభ మార్కు మయసభ

వేళ్ళపల్లి వెంకటలక్ష్మీనారాయణ

ధర్మరాజశ్వమేధయాగం చేసేప్పుడు మయుడో యిల్లు కట్టి, దానికి 'మయసభ' అని పేరు పెట్టించాడు. ఆ సభలో బోలెడన్ని మాయలు సృష్టించాడు. మనుష్యుల్లేకుండానే వచ్చిన మనిషిని పిచ్చివాణ్ణి చేసే మాయలు ఎన్నో వుంచాడు. అందరూ వస్తున్నారు. చూస్తున్నారు. కిందపడ్తున్నారు. మీద పడ్తున్నారు. చివరికి ఆశ్చర్యపడ్తున్నారు. దుర్యోధనుడు కూడా వచ్చాడు. వాడూ బోల్తాపడ్డాడు. నీళ్లు లేవనుకుని నీళ్లల్లో పడి, గోడ లేదనుకుని గోడ కొట్టుకుని గోలపెడుతుంటే పైనుంచి చూసి ద్రౌపది నవ్విందిట. పైకి చూసి పగబట్టాడు దుర్యోధనుడు. పోనీ యిదసలే మాయాసభ, వున్నవి లేనట్లూ, లేనివి వున్నట్లూ కనిపిస్తున్నయ్. మనకనుపించి నవ్వింది ద్రౌపది కాదేమోలే అని సరిపెట్టుకోలా. తర్వాతో కాండ చేశాడు. యిలా దుర్యోధనుడు సభలో బాధ పడ్తుంటే మయుడికో వింత కోరిక పుట్టింది. వెంటనే ధర్మరాజునో మాటివ్వమన్నాడు. ధర్మరాజు యిచ్చాడు. ధర్మరాజు మాటలివ్వడంలో నిధి పైగా అవి నిలబెట్టుకుంటాడు. అదీ అతగాడి గొప్ప. ధర్మరాజు సరే నన్నాక మయుడడిగాడు, 'నా సభలో కొందరు మొండివాళ్లను చూసి పండితులుగా వేసి, వాళ్లచేత ప్రశ్నలు వేయించి మీ దుర్యోధనుణ్ణోడిపిద్దామా?' అన్నాడు కానీ ధర్మరాజుకి దుర్యోధనుడి మీద జాలి వేసింది. అందులో అయినవాడు. ఏమయిపోతాడోనని జాలిపడి 'అబ్బే వాడసలే అర్భకుడు. ఆర్భాటం తప్ప ఏంలేదు. అలాంటి వాడి మీదా నీ ప్రయోగం'అన్నాడు. కానీ మయుడిలో ఈకోరిక చాలాబలంగా వుంది. నాకోరికవూరికే పోవాల్సిందేనా'అన్నాడు చిన్నబోయి. ధర్మరాజు ఆడితప్పనివాడు. ఆడి ఓడినా ఫర్వాలేదంటాడు. ఈ రోజుల్లో వుండాల్సిన వాడుకాదు. అందుకే ఆ రోజుల్లో వున్నాడు. అందుకని, 'సరే నీ కోరిక కలియుగంలో తీరుతుంది. అప్పుడు యీ చదువుకున్న వాళ్లు కష్టపడి డిగ్రీలు తెచ్చుకున్నా మళ్లీ పరీక్షలు పెట్టి, ప్రశ్నలు వేసిగానీ ఉద్యోగాలివ్వద్దనే రూలు పెట్టిద్దాం. నీ మొండి వాళ్లని అప్పటికి సిద్ధం చెయ్యి' అన్నాడు. మయుడు సంతోషించాడు. యింటికి వెళ్లిపోయాడు.

నిరుద్యోగి నీట్‌గా టాయిలెట్ అయి బట్టలు నలిగిపోకుండా నడిచి యింటర్వ్యూ చేసే ఆఫీసుకి వచ్చాడు. అప్పటికే అక్కడికి చాలామంది చేరుకున్నారు. అందరూ ఏవేవో పుస్తకాలు చూస్తున్నారు. కొందరు మరీ అప్టుడేట్‌గా వుంటానికని ఆ రోజు పేపరు చేతిలో వుంచుకున్నారు. అఖిలభారత కాంగ్రెసు అధ్యక్షుడి దగ్గర్నుంచి ఐక్యరాజ్య సమితి సెక్రటరీ జనరల్ దాకా పేరు పేరునా వల్లెవేస్తున్నారు. కొందరివేమీ చూడకుండా, పట్టించుకోకుండా నిమ్మకు నీరెత్తినట్లు కూర్చున్నారు. వీళ్లు అనుభవజ్ఞులు. మొండికెత్తినవాళ్లు. వీళ్లు పక్కవాళ్లని చూసి అప్పుడప్పుడూ నవ్వుకుంటున్నారు. అనుభవం లేనివాళ్లు! పబ్లిక్ పరీక్షలనుకున్నారేమో, పబ్లిగ్గా చదువుతున్నార'ని జాలిపడ్డారు.

యింతలో ఎవడికో అనుమానం వచ్చింది 'కెనడా ఫుడ్ మినిష్టరెవ'రని. పక్కవాణ్ణడిగాడు. వాడు తెలియదన్నాడు. ఆలోచిస్తే తెలుస్తుంది కానీ, ఆలోచించేందుకు టైము లేదన్నాడు. ఎవరూ చెప్పలేదు.... నిమ్మకు నీరెత్తినట్లు కూర్చున్నవాళ్ళూ చెప్పలేదు. వాళ్లకి తెలుసేమోనని అనుమానపడ్డారు పక్కవాళ్లు. అనుమానం తీర్చుకుందామని అడిగారు. వాళ్లు తెలియదన్నారు. 'ఎందుకు తెల్సుకోవా'లన్నారింకా పైగా. తెల్సుకోవాలనీ లేదన్నారు. ఆ మాట కొస్తే యిండియా ఫుడ్ మినిస్టర్ ఎవరో కూడా తెలీదన్నారు. 'అయినా యిండియాలో ఫుడ్ లేదుట కదా, ఫుడ్ మినిస్టరుంటాడా' అనే సందేహం వెలిబుచ్చారు.

'అయితే మీకేం తెలియకపోయినా చాలా ధైర్యంగా వున్నారే మీరు' అనడిగాడు వాళ్లని మన నిరుద్యోగి. వీడికిదే మొదటి యింటర్వ్యూ. యింటర్వ్యూలంటే భయపడ్తాడు. భయపడందే అసలు యింటర్వ్యూ కళ రాదేమోనని కూడా భయం... 'ధైర్యం గాక ఏం....ఉద్యోగానికివన్నీ రానవసరంలేదు. మనమేవన్నా కెనడా వెళ్లాలా పెట్టాలా? అక్కడ పుట్టాలా?...చదువుకున్న వాళ్లెక్కువై వాళ్లకుద్యోగాలు చూపించటం లేదంటారని "అబ్బాయిలూ, మీ కవి వొచ్చునా? అవొస్తే యివి రాలేదు గదా. యివిరాందే ఉద్యోగాలు రావుగదా మరి. అంద్

కాని నిరుద్యోగ సమస్య తీర్చాలని మన్మల్ని కొద్దు" అనేందుకే యీ యింటర్వ్యూలు గాని, అసలు వుద్యోగాలకి పిల్చటిగే వస్తే అక్కర్లేదు' అన్నారు మొండి జాతివాళ్ళు... కేవడా ఆహారమంత్రి అంతటితో అవతల కెళ్ళిపోయాడు....అయినా ఏవడో అను కుంటానే వున్నాడు 'వివరణ్ని' అంటూ. పక్కవాడు 'హోట్లో అడ్తోందిగానీ బయ టకు రావటల్లేద'న్నాడు. అడిగినవాడు భయపడ్డాడు. భయం, మంత్రెవరో కలియ పండుకుతాడు. వాడికి హోట్లో అడ్తా యిప్పుడు బయటకు రాకుండా ఆఫీసరు దగ్గరోస్తుందేమోనని...అయినా జాగ్రత్త కోసం, 'ఆ కేవడా ఫుడ్ మినిస్టరీ లోపల బయట కొస్తే చెప్ప'మన్నాడు.

యింటర్వ్యూ మొదలైంది. ఒక్కొక్క డికీ పది నిముషాల సేపు పరీక్ష....ఒకడు బయటు కొచ్చాడు. వాడి చుట్టూ చేరారు అందరూ. మంత్రి చుట్టూ చేరే విలేఖర్ల మాదిరి, పోస్టుమేన్ చుట్టూ చేరే నిరు ద్యోగుల మాదిరి. అసలు వేటి మీద వేస్తు న్నారు కొశ్చెన్లు అనడిగారు.. అభిమన్యుడు పద్మ వ్యూహాన్ని ఛేధించుకొస్తే సరిగ్గా యీ ఫోజే పెట్టేవాడేమో? వ్రరాణ కథల్ని యిష్టం వచ్చినట్లు తీయగల ధైర్యం గల ప్రొడ్యూసరొక డొచ్చి యితగాడి ఫొటో తీసుకెళ్ళాడు. ఆ ఫోజు తన నెక్స్టు పిక్చర్లో పద్మవ్యూహాన్ని జయించి వచ్చిన అభి మన్యుడి వేషం వేసే హీరోకి రిహార్సుల్లో చూపించొచ్చని.

'ఆ, అన్నీ అడుగుతున్నాడు. ఎక్కువగా సబ్జక్టడుగుతున్నాడు' అన్నాడు అభిమన్యుడు.

'కేవడా ఫుడ్ మినిస్టరు పేరడిగారా' అన్నాడొకాయన. 'నన్నడగ లేదుమరి' అంటూ వస్తానని చెప్పి, 'విష్ యూ గుడ్ లక్' అని పించుకుని 'విష్ది సేమ్ టుయూ' అని అభిమన్యుడు వెళ్ళిపోయాడు.

నిరుద్యోగికి పిలుపు వచ్చింది. నిరుద్యోగి క్రాపు సర్దుకొని లోపలి కెళ్ళాడు. ముగ్గురు గుండ్రంగా కూర్చుని వున్నారు లోపల. ముగ్గురూ నిరుద్యోగి వంక చూశారు. ఆ చూపుల్లో భావంగానీ జీవంకానీ లేదు. ఆహ్వానం అంతకన్నా లేదు. యింట్లో కొచ్చే నిరుద్యోగిని చూసే యింట్లో వాళ్ళ మాదిరి చూశారు...ఎందుకో చూస్తారు. 'లోపలి కొచ్చాడు గదా' అని చూస్తారు...నిరుద్యోగి అక్కడున్న కుర్చీలో నిదురుగా కూర్చున్నాడు. కుర్చీలో కూర్చోమనకుండా కూర్చుంటే వ్యక్తిత్వం వునట్టు లెక్కట. అలా [illegible] యింటర్వ్యూలో మార్కు గలవని నక్కేట. అంతలో ఒకడు ప్రారం భోత్సవం చేశాడు. తొలి పలుకులు పలికాడు 'మీదే వూరంటూ'. నిరుద్యోగి చెప్పాడు. 'అలాగా, బెజవాడ దేనికి ప్రసిద్ధి' అని మళ్ళీ అడిగాడు. ప్రతిపట్నం దేనికో దానికి ప్రసిద్ధని యితడి అనుమానం. 'దేనికా?' అని నిరుద్యోగి అనుమానం, 'అన్ని పట్నాల లాగానే నిరుద్యోగులక'న్నాడు నిరుద్యోగి.... యింకోడు మొదలుపెట్టాడు. 'మువ్వేమన్నా ప్రజాసేవ చేశావా?' అనడిగాడు. యితగాడో దేశభ(భు)క్తుడు. పూర్వం ఎపుడో ప్రజాసేవ చేశాట్ట. వోసారి చేసి మిగతా వాళ్ళకి అవ కాశం యిద్దామనే వుద్దేశ్యంతో యిపుడు ఎప్పుడోగానీ ప్రజాసేవ చేయడు అపుడు పుడూ చేస్తూ ఎప్పుడూ దేశం మీద పడి తింటూంటాడు. ప్రతిపనీ దేశభక్తితోనే చేస్తాట్ట. ప్రతిపని వెనకాలా దేశభక్తి వుండాలంటాడు. వెనకాలే వుండాలంటాడు. అతడేం చేసినా దేశభక్తి వెనకాలే వుంటుం దిట అదే అతని ఆశయంట కూడా. యిప్పుడు వేసిన ప్రశ్న వెనకాల కూడా దేశ భక్తి వుందిట....నిరుద్యోగి ఆలోచించి యిలా అన్నాడు, 'అయ్యా, నాకూ మీ మాదిరి వుద్దేశ్యాలే వున్నాయ్. కానీ అవకాశం లేక పోయింది...కానీ నా శక్తి కొద్దీ ఏదో ప్రజా సేవ చేశాను. మా బజార్లో పోస్టాఫీసు 'ఎక్స్‌పెరిమెంటల్'గా పెట్టారు మొదట్లో ఆ పోస్టుమాస్టరే రోజుకో వుత్తరం రాసుకునేవాడు. వాళ్ళనీ వీళ్ళనీ, రోడ్డు మీద వాళ్ళని అడిగి వాళ్ళ అడ్రసు తీసు కుని తను వాళ్ళ వుత్తరాలకి సంరక్షకు డుగా వుంటానని చెప్పి తన పోస్టాఫీసు అడ్రసు యిప్పించుకునేవాడు. యిలా ఏం తంటాలు పడ్డా ఏం కుదర్లేదు కొన్నాళ్ళకి పోస్టాఫీసు నుంచి ఓ ఉత్తరం కూడా వెళ్ళ టం మానుకుంది. రావటం మానుకుంది. పోస్టుమాస్టరు బెంగెట్టుకున్నాడు. బెంగ పోస్టాఫీస పోతుందని కాదు. దాంతో తన వుద్యోగం పోతుందని సరిగ్గా ఆరోజునే



మా తెలివి వచ్చిందయ్. ఆ తర్వాత నుంచి నేను 'అప్సె' పోసేందుకు కవర్లు కార్డులూ పోస్టలార్డర్లూ, స్టాంపులూ కొంటూ ఆర్డినరీ పోస్టుల్లోనూ, రిజి స్టరు పోస్టుల్లోనూ పంపేవాణ్ణి. పోస్ట లార్డర్లు కొనేటప్పుడూ, రిజిస్టరు పోస్టులో పంపేటప్పుడు ఆ పోస్టుమాస్టరు ముఖం చంద్రబింబంలా మెరిసిపోయేది.... ఆ పోస్టుమాస్టరన్నాడు 'బాబూ, నా ఉద్యో గం నిలబెట్టావు...మువ్వెట్టాగో నీ వుత్త రాల్ని, అప్లికేషన్సుని పత్రిళ్ళ చేస్తూ వుండు' అని. 'నీ పేరే పెడ్తాను పోస్టాఫీసు క'న్నాడు. 'నాకు సేవ చెయ్యడమేకాని పేరెట్టుకోటం అలవాటు లేదు మీ మాదిరే. అందుకని వద్దన్నాను' అని పూర్తి చేశాడు నిరుద్యోగి.

'అప్పే యిది పెద్ద ప్రజాసేవ క్రింద లెక్కకాదు' అని కొట్టిపారేశాడు దేశ భక్తుడు.

'అయ్యా! తమరు ప్రజాసేవనే అన్నారు గానీ పెద్దాచిన్నా అని స్పష్టంగా చెప్పలేదు. తమరిది పెద్ద ప్రజాసేవ కాదన్నారు కాబట్టి చిన్నదని వప్పేసుకున్నారు. అందు కని నేను ప్రజాసేవకుణ్ణే' అన్నాడు నిరు ద్యోగి. దేశభుక్తు డాలోచించి మళ్ళీ వక ప్రశ్న వేశాడు. 'మువ్వెపుడన్నా స్వతంత్ర పోరాటంలో జైలు కెళ్ళావా' అన్నాడు యిత గాడు చూడొచ్చాడా అని వెళ్ళానందామను కున్నాడు. కానీ తన వయస్సిరవై అయిదని గుర్తొచ్చి—

'స్వతంత్రం వచ్చేసరికి నాకు ఆరేళ్ళు కూడా వుండవు. అప్పటికింకా స్వంత వుద్దేశ్యాలు, స్వతంత్ర వూహాలు వుండి వుం డవు....అయినా క్రిందటి జన్మలో స్వతంత్ర పోరాటంలో పోరాడి ఏ ఝూన్సీకో, శాంతి యాకోసహాయం చేసుంటాను. మా వాళ్ళూ అదే అంటూంటారు, 'నువ్వీ జన్మలో స్వాతం త్ర్యం కోసం పాటుపడకపోయినా నాయ కుడు వవ్వలేదు. బహుశ క్రిందటి జన్మలో ఆపని చేసుంటావు. అందుకే యిప్పుడు అనుభవిస్తున్నావు. కనీసం ఉపనాయకుడ వన్నా అవ్వలేదు' అన్నాడు.

దేశభక్తుడు హుంకరించాడు. కోప్పె డ్డాడు. 'అంటే యీ నాయకు లంతా ఏం పాటుపడలేదనేగా నీ వుద్దేశ్యం....' అన్నాడు. నిరుద్యోగి భయపడ్డాడు 'అయ్యా! తమరు అపార్థం చేసుకున్నారూ

అర్జంటు ఆఫీసుపని... కాని రామారావుకు తలనొప్పి







రామారావు ఒక సారిడన్ వేసుకొనును



తరువాత...




# ఒకే ఒక సారిడన్ రోష్

## నొప్పిని పోగొట్టును, సేదదేర్చును, నవోత్సాహమును కలిగించును.

నొప్పికి ఉపశమనకారిగా ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన సారిడన్ నొప్పులనుండి శీఘ్రముగాను, నిరపాయముగా, విశ్వాసముగా ఉపశమనం కలిగిస్తుంది. తలనొప్పి, పంటినొప్పి, ఒళ్ళునొప్పులు, సాధారణ అస్వస్థతలు మొదలైనవాటి నివారణకు ఎల్లప్పుడూ వాడండి. పెద్దవారికి ఒక బిళ్ళ; పిల్లలకు ½ నుంచి ¼ బిళ్ళవరకు




(ఒకే ఒక సారిడన్ బిళ్ళ చాలును)



రోష్ తయారు

[ఏకైక డిస్ట్రిబ్యూటర్లు: వోల్టాస్ లిమిటెడ్]

సరిగ్గా విన్నేదు. అలా అంది మా వాళ్ళ కాపీ వేసుకాదు' అన్నాడు.

'నాకు చెవుడంటావా?' అన్నాడు దేశ భుక్తుడు.

'మీరు మళ్లీ అపార్థం చేసుకున్నారు.' అంటూ నిరుద్యోగి చెప్పబోయాడు.

'నేనింకేం అడగను. మీరడగండి' అని సక్సేనా చెప్పికుర్చీలో జారగిలపడ్డాడు.'

సక్సేనాకు ఫ్రెంచ్‌మన్. అవే అక్షరాలు. మొదట్లో ఉంగరాల జుట్టు వుండేదేమో? దాని మొదటి ఉంగరం మెలు వులోనే చేధించి పైకి నిలబడేట్టు చేసి హాలీవుడ్ క్రాప్ కొట్టించాడు. వళ్లంతా కండలు తిరిగి వుంది. ముఖం మాత్రం పీక్కుపోయి వుంది. ముఖం నిరుద్యోగి ముఖం మాదిరి వుంది. వళ్లు మాత్రం నిరుద్యోగి ఆశ మాదిరి వుంది. ముఖం చూసి 'మీరూ నిరుద్యోగులేనా' అని అడు గుదామనుకున్నాడు. కానీ మిగతా శరీరం, చూసి ఆ వుద్దేశ్యం తాత్కాలికంగా అను చుకుని వీడు యింటర్వ్యూ చేసేవాడని గుర్తుకు తెచ్చుకుని విరమించుకున్నాడు. అటుగాడు నిరుద్యోగితో చెలగాటం మొదలు పెట్టాడు.

'పరుగుపందెంలో మీకంటె ముందుగా నినడన్నా పరుగెత్తుతుంటె గెలవాలంటె మీరేం చెయ్యాలి' అన్నాడు.

'యింకా జోరా పరుగెత్తాలి' అన్నాడు నిరుద్యోగి.

'అదేం లాభంలేదని తెలిశాక ఏంచేస్తారు' మళ్లీ అడిగాడు. నిరుద్యోగికేం పాలుపో లేదు....కాస్సేపటి వరకూ ఎవరూ ఏం మాట్లాడలేదు..అటుగాడు నవ్వుకుని మళ్లీ ప్రశ్న వేశాడు. యీ యింటర్వ్యూ చేసే వాళ్లతో యిదే చిక్కు. చెప్పలేని, సమా ధానంలేని ప్రశ్న అడగటం సరదా. వేసిన వాటన్నిటికీ సమాధానం చెప్పే వాండిడేటుని చూస్తే కొందరి కసిలు కోపంట. తక్కు వున్న వాళ్ళు 'నీ ప్రశ్న లన్నిటికీ సమాధానం చెప్పాడా కుర్రాడు. నీ గొప్పేమిటి?' అంటారట్ట తర్వాత. అందుకని ఏదో ప్రశ్నగా తలాతోకాలేందిగా, సమాధానం రాందిగా వేస్తారు. ఈ అటుగాడు అలాంటిది ముందే వేశాడు.....అటుగాడు మళ్లీ మొదలెట్టాడు. 'మీరెపుడూ ఆడతారా' అన్నాడు. 'లేదా న్నాడు నిరుద్యోగి. తన చదువేమిటో తనే

# నిరుద్యోగపర్వం

చిటో అన్నాడు. ఎప్పుడూ ఆటలాడనన్నాడు. నిరుద్యోగికి అనుభవం తక్కువ. పెద్దాళ్ల మాదిరే ఆఫీసర్లు కూడా ఆటలాడని వాళ్లని మెచ్చుకొని వుద్యోగా లిస్తారను కున్నాడు....అటుగాడా సమాధానం విని 'షేమ్' అని బిగ్గరగా అరిచాడు.

'జీవితం క్రికెట్టన్నా నవ్వా' అన్నాడు. నిరుద్యోగి కేం చెప్పాలో అర్థంకాలేదు. నిజం చెప్పాలంటే నిరుద్యోగికి క్రికెట్టు రాదు. కొంచెం కూడా రాదు. ఆ సంగతి చెప్పితే యీ వుద్యోగం రాదు. నచ్చని చెబితే'స్కారు ఫలానాగా వుంటే నువ్వేడుస్తావా నవ్వు తావా?' అని అడిగితే రెండోదే శరణ్యం... నిరుద్యోగి ఏం సమాధానం చెప్పలేదు. అటుగాడు ఏదో రాసుకుని 'ప్స్' అన్నాడు.

'నువ్వెళ్లొచ్చు' అన్నాడు. 'సబ్జెక్టేం అడగరా' అన్నాడు నిరుద్యోగి ఆశ్చర్యంగా.

'సబ్జెక్టు నడికి కావాలి? నీ కాటలే రావు' అన్నాడు అటుగాడు.

'నీకు ప్రజాసేవ చేతవ్వదు. ఆఫీసు సేవేం చేస్తావు' అన్నాడు దేశభుక్తుడు.

నిరుద్యోగి బయటకొచ్చాడు..... మిగతా నిరుద్యోగులు చుట్టుముట్టారు యథా ప్రకారం. 'సబ్జెక్టడగరు' అన్నాడు నిరు ద్యోగి. మిగతా వాళ్లాశ్చర్య పడ్డారు. ఫ్రెస్టు బుక్కు చదవటం మొదలెట్టారు. 'ప్స్' వాళ్ల ప్రెండు నిరుద్యోగి నడక మాదిరి చిటు వెడుతూందో చెప్పలేకుండా వున్నాం' అని నిరుత్సాహపడ్డారు. ఎందు కైనా మంచిదని రెండుచేతుల్లో రెండూ పుచ్చుకుని చదువుతున్నారు..

నిమ్మకు నీరెత్తనట్లు కూర్చున్న, వాళ కింద ఏనుగులా వున్న సీనియర్ నిరుద్యోగి యీ నిరుద్యోగిని సమీపించాడు. 'డియర్ జూనియర్, ఏమిటా ఫేస్? టక్కుట్టు దొర కని వాయకుడిలా...మార్చెయ్ ఫీలింగు. ఈ ఉద్యోగం రాకపోయిందని ఎందుకు బెంగ. నీకేం రికమండేషను లేదు కదా? రికమండేషను తెచ్చినా ఉద్యోగం రానట్లు బాధపడ్తావేం? యీ వుద్యోగం నీదనుకో మని ఎవరన్నారు...యూనివర్శిటీ వరీ క్షల్లో పరీక్ష పేపరు తగలెట్టినట్లు చిటా ముఖం. పెళ్లు. బయటకెళ్లి యివాళా రేపూ హైదరాబాదు చూసి ఎల్లుండి రైలెక్కు' అన్నాడు. నిరుద్యోగి రుమాలుతో ముఖంతుడ్చుకునిబయల్దేరాడు.

(ఇంకా ఉంది)



చెప్పాను.

శాంతి మౌనంగా కూర్చుండిపోయింది. ఆమెను చూస్తుంటే నామనసుకెందుకో అపరిమితమైన శాంతి లభిస్తుంది. ఒకప్పుడు నాకు శాంతి అంటే అపరిమితమైన ప్రేమవుండేది. దైవం దయదల్చివుంటే ఆమెనే వివాహమాడే వాడిని. కానీ విధికృతం— కాదు స్వయంకృతం! నాలోని భావన నేనాడూ నేనామె ముందు ధైర్యంగా వుంచలేక పోయాను. నాపిరికితనం నాకు తగిన శిక్ష విధించింది. ఏదో పోగొట్టుకొన్న వాడిలా నాలుగు సంవత్సరాలు బాధపడ్డాను. తరువాత రాధతో పరిచయం. మా ఇద్దరి వివాహం జరిగింది.

ఆలోచిస్తూ కూర్చున్నాను.

నాలో రేగుతున్న యీబాధ శాంతి, మాలతులకు మాత్రం తెలుసు. శ్రీనుకు కూడ చెప్పలేదు నేను.

"మీ జీవితాల్లో థ్రిల్ లేదట శాంతీ. కావాలను కొన్నారాదట" అన్నాను.

"ఎవరన్నారు—రాధేనా?"

తలూపాను.

శాంతి నవ్వింది" రాధ వూహాలోకంలో జీవిస్తోంది రామం. నవలలు చదివి, సినిమాలు చూసి జీవితాన్ని అత్యున్నతంగా వూహించుకొంది. పెళ్లయిన రెండు సంవత్సరాల్లో ఆ క్రొత్తదనం పోయి వాస్తవికతను ఎదుర్కొని నిరుత్సాహం చెందుతోంది. ఆ నిరుత్సాహం లోంచి తేరుకొని వాస్తవికతను ఎదుర్కోటానికి అలవడటం ఇష్టంలేక క్లబ్‌లూ,పార్టీలూ లాంటి కాల్పనిక జగత్తును తనచుట్టూ సృష్టించుకొని, వాటిల్లో ఆమె చెప్పే ఆ 'థ్రిల్'ని వెతుక్కుంటోంది. బహుశా ఆకాల్పనిక, వాస్తవికతల మధ్య పోరాటమే ఆమె నిన్ను నిర్లక్ష్యపరచటానికి కారణం కావచ్చు. నాఉద్దేశ్యంలో ఆమె నిన్ను న్యూన పరుస్తున్నట్లు ఆమెకే తెలీదని..."

"నువ్వు చెప్పే మొదటి విషయం నిజంకావచ్చు శాంతీ కాని నన్ను తను నిర్లక్ష్య పరుస్తున్నట్లు తెలీదంటే ఒప్పుకోను. ఒకమాటు స్పష్టంగా చెప్పాను. పరోక్షంగా తెలియ జేశాను. కళ్లుపెద్దవి చేసి అమాయకంగా 'అలానా?' అంటుంది కాని ప్రవర్తనలో మార్పురాదు. అసలు నాలోనే ఏదోలోపం వుందేమోనని అనుమానంగా వుంది..."

# వెగసిన నీడలు

(12వ పేజీ తరువాయి)

శాంతి వింటూ కూర్చుంది.

నాహృదయంలోని బాధనంతా వెళ్లగ్రక్కాను. శాంతి వూకొడుతోంది. ఏం చెప్ప గలదు ఆమె మాత్రం?

శీను వచ్చాడు. కబుర్లలో పడ్డాం. చీకటి పడింది.

ఇద్దరూ లేచారు. నేను ఇంకాసేపు అక్కడే కూర్చుంటా నన్నాను. వాళ్ళ అబ్బాయితో 'టాటా' చెప్పించి వెళ్ళిపోయారు. ఆలోచిస్తూ కూర్చుండి పోయాను నేను. నాలో లోపాలేమైనా వున్నాయా అని నిర్దాక్షిణ్యంగా పరిశీలించుకోసాగాను.

లోపాలు లేక పోలేదు.

—ఏమనిషి పూర్తిగా పరిపూర్ణుడు కాడు. కానీ, నాయీ లోపాలు ఒకవేళ రాధని ఇరుకున పెట్టినా క్షమింపరానివి మాత్రం కావు. ఈ ఆత్మ పరీక్ష ఒక సారికాదు పలువార్లు చేసుకొన్నాను— రాధ నన్ను నిర్లక్ష్య పరచినపుడల్లా. రాధకి అనువుగా నన్ను మలచుకోటానికి నిరంతరం కృషి సల్పుతూనే వున్నాను.

బహుశా అదేనేమో నాపొరబాటు.

—ఇలానే ఆలోచిస్తే నాలో అహం తల ఎత్తుతుంది. రాధకు నేను ఎందులో తీసిపోతాను?

ఆమె అందానికి తగనా?

విద్యలేదా? హోదాలేదా?— సంస్కారం లేదా? సభ్యతలేదా?— కాదు. ఇది ఆలోచించాల్సిన రీతికాదు. ఈ విధంగా సాగించిన ఆలోచనల మధనంలోంచి ఎలాంటి పరిష్కార మార్గమూ గోచరించదు.

అసలు ఆలోచనలో పనికాదు— నిర్మాణాత్మకమైన పనిజరగాలి. ఏమిటది??

—మళ్లీ బుర్ర శూన్యం.

బీచిలో అందరూ వెళ్లిపోయారు. సెర్చిలైట్‌లా బీచిమీద వెన్నెల వెదజల్లి నా ఒంటరితనాన్ని ప్రస్ఫుటంచేస్తున్నాడు శశాంకుడు.

ఎదురుగా అఘాతమైన సముద్రం.

ఒడ్డున ఇసుక రేణువులాంటి నేను.

అవ్వలి దరి చేరటం సాధ్యమా?

ఒంటరితనం చిరాకనిపించింది. ఋషులు, మునులు ఈ ఏకాంతంలో చూసిన ప్రశాంతత ఏమైందో మరి! రాధకూడ డాబాపై పడక కుర్చీలో కూర్చొని ఆలోచిస్తూ వుంటుంది "ఏమైంది జీవితానికి? ఎక్కడికి పోయింది జీవితంలోని థ్రిల్!" అని.

నుంచోని నడక ప్రారంభించాను.

రాత్రి డైరీలో వ్రాశాను నాబాధంతా.

భోజనం చేశాక నవల చదువుకొంటోంది రాధ.

"ఉదయం క్యాంప్‌కి వెడుతున్నాను రాధా" అన్నాను.

"ఎక్కడికి?"

చెప్పాను.

"ఎన్ని రోజులు?"

"బహుశా వారం రోజులు కావచ్చు"

"ఆరోగ్యం జాగర్త. దోమతెర తీసుకపోండి. మాలతిని అడిగానని చెప్పండి— కలుస్తారుగా?"

"బహుశా—" అన్నాను.

అంతే. ఆతరువాత మాటలు దొరక లేదు. రాధ నవలో మొహం దాచుకొంది. దిండులో తలదూర్చి అశ్రుపూరిత నయనాలని రాధనుండి దాచుకొన్నాను నేను.

* * *

అయుదు రోజులు వరుసగా ఆఫీసు పనులలో గడబిడ పడ్డాక ఆరో రోజు తీరిక దొరికింది. మాలతి ఇంటికి బయలుదేరాను.

"ఏమోయ్— మరదీ! తీరిక దొరికిందా?" అంది మాలతి.

"అంటే నేను క్యాంప్‌కి ఇక్కడికి వచ్చినట్లు నీకు ముందే తెలుసునేమిటి?" అన్నాను.

"ఆ!" అంది.

"ఎలా?"

"ఉమన్స్ ఇంట్యూషన్"అంది నవ్వుతూ.

"పోదూ! నీక్కూడా పట్టించిందేమిటి ఆ నవలల పిచ్చి రాధ నాలుగు నెలల్లో!" అన్నాను.

నవ్వి వూరుకొంది.

"అన్నయ్య గారేరీ?"

"పొలానికి వెళ్లారు" అంది.

కబుర్లలో పడ్డాం.

ఉబుసుపోక కబుర్లయ్యాక అసలు విషయంలోకి వచ్చాను.

"ఈసారి నువ్వు ఇంటికి వెళ్లేటప్పటికి మారివుంటుందిలే రాధ." అంది.

"ఏం? మ్యాజిక్‌లాంటి దేదేనా చేశావా?"

"అదేం లేదురామం. నువ్వు ఒకటి మర్చి పోయావు. నువ్వు చేసిన పొరబాటే

నేనూ చేశాను. ఎంత కరకు హృదయమేనా ఒక మున్నితమైన హింట్‌తో మారి పోగలదన్న విషయం ఇరువురం విస్మరించాం. రాధది కరకు హృదయం కాదు. నిర్లక్ష్య హృదయ ఆమె. ఆమెకు బోధన ద్వారా మనభావాలని తెలియజేయాలని ప్రయత్నించాం.కానీ....."

"నువ్వంటున్న దేమిటి? రాధనిజంగా మారుతుందనే!— జోక్ వేస్తున్నావా?"

"కాదు నిజం" అంది.

"అసంభవం మాలతీ!" అన్నాను.

"అది నీకు—నాకు. శాంతికి కాదు."

శాంతి!?

ఆశ్చర్యం వేసింది నాకు.

"శాంతి రాధని మార్చిందా?"

"స్వయంగా కాదనుకో—నీద్వారా"

"నాద్వారానా?"

"వూ!"

"నాకు అర్థంకావటంలేదు."అన్నాను.

"దీన్ని చూడు. నీకు అర్థమవుతుంది" అంటూ టేబిలు సొరుగు తెరచి ఒక ఉత్తరం తీసి అందిస్తూ "నీకీ ఉత్తరాన్ని చూపటానికి నాకు అనుమతిలేదు. అయినా చూపుతున్నాను."అంది

ఉత్తర్తం అందుకొన్నాను. అది రాధ వ్రాసిన ఉత్తరం. మాలతి వైపు వోమాటు తలఎత్తి చూసి, ఉత్తరం మీదికి చూపులు పరుగెత్తించాను.

"...మాలతీ ఈ విషయాన్ని ఆయన నాతో చాల సార్లు అన్నారు. కూర్చోబెట్టి బోధించారు. చివరికి నీతో కూడచెప్పారనుకొంటాను. నాసాంసారిక విషయాలను గూర్చి నువ్వు తరచి ప్రశ్నలడగటం అందుకే కదూ?

నిజం ఆయన్ని నేను ఇవాళదాకా అర్థంచేసుకోలేదు. ఆయన మనసులోని బాధ ఇవాళకాని నాకు అవగతం కాలేదు. ఇవాల్టి నుంచి - నాలో మార్పువచ్చింది. నువ్వు నమ్మినా, నమ్మక పోయినా నిజం అది.

నువ్వూ, ఆయనా, నాలోపాలని నా కళ్లకి తేవాలను కొన్నపుడు కూర్చోబెట్టి కుర్రాడికి పాఠం చెప్పినట్లు చెప్పారు. నాలోని ఆత్మాభిమానాన్ని తట్టిలేపారు. అహాన్ని వెలికి తీశారు. దాంతోమీమాటలు సరిగ్గా వినలేకపోయాను. విన్నమాటలు అర్థం చేసుకొందుకి ప్రయత్నించలేదన్న విషయం కూడ నిజం.

కాల్పనిక జగత్తులో వూగిసలాడుతున్న వ్యక్తికి— నువ్వు కల్పనలలో కట్టు

# వెగసిన నీడలు

బడి వున్నావని చెప్పిచూడు.

ఆవ్యక్తి అంగీకరించదు.

పైగా నువ్వే పొరబడ్డావని అనిపిస్తుందా వ్యక్తికి. నీవేపో వెలికినవ్వు విసరబడుతుంది. నావిషయంలోనూ అంతేజరిగింది.

మరి ఎలా నేనా విషయాన్ని తెలుసుకొన్నానో, ఎందుకు మారానో తెలుసుకోవాలని నీకు కుతూహలంగా వుంది కదూ? కాని మాలతీ విన్నాక అంత హర్షించవేమో!

ఆయన క్యాంప్‌కి వెళ్లిన ఉదయం ఎందుకో టేబిల్ సొరుగు తెరచాను. నేను ఆయనకి యిచ్చిన డైరీ తెరచివుంది. పెన్ క్యాప్ కూడా వేయకుండా తెరచిన పేజీలమీద పెట్టివుంది.

అదితీసి సరిగావుంచటానికి వాటి మీదికి చేతిని పోనిచ్చాను. ఏదోరకమైన కుతూహలం నాలో రేగింది.

నేను చేస్తున్నది తప్పే—నాలో మథన! సంస్కారానికీ, కుతూహలానికీ పోరాటం. అప్రయత్నంగా 'శాంతి' అన్న పదం మీదికి నాదృష్టి పడింది. అంతే! కుతూహలమే జయించింది.

మూడు రోజులుగా ఆయన వ్రాసుకొన్నదంతా చదివాను అరగంటలో! మళ్లీ చదివాను.

అర్థమైంది ఆయన బాధంతా. ఈ సారి నాకు ఎవరో బోధిస్తున్నట్లు లేదు. వేదనని వెళ్ల బోసుకుంటున్నట్లు లేదు. ప్రార్థనల ద్వారా ఆదేశాల ద్వారా నన్ను మారమని శాసిస్తున్నట్లు లేదు.

జ్ఞానోదయం కలిగిస్తున్నట్లుయింది!

శాంతి అందిట నాగురించి" ఆమెకి వోషాక్ లాంటి థ్రిల్‌యివ్వు రామం. ఆ థ్రిల్‌లో థ్రిల్ లేదని ఆమెకి తెలిస్తే వాస్తవిక ప్రపంచాన్ని అర్థంచేసుకోగలదు" అని!

"డిటెక్టివ్ కథల్లో లాగానా?" అని ఆయన నవ్వారట.

పైమాటలే, శాంతి నాఎదురుగా అనివుంటే నాభావనలు ఎలా వుండేవో కాని, చదువుతోంటే తమాషాగా తోచింది. ఆయన సమాధానం చదివాక నవ్వొచ్చింది. కాని అప్పుడే నేను సరియైన ఆలోచనా పథంలో పడ్డాను. నాలుగు నెలలు నీతోపాటు చుట్టుప్రక్కల వూర్లన్నీ చూశాను. చెరువులో ఈతలు కొట్టాం కదూ? అర్థరాత్రివేళ దూరంగా వున్న పట్టణపు థియేటర్ నుండి నడచి వచ్చాం. మామిడి తోపులు తిరిగాం. కొండలు, గుట్టలు, ఆపురాతన కోటగోడలు, పాడు పడిన దేవాలయాలు—వో—హో నేను థ్రిల్‌గా ఫీలయిన వెన్నోవున్నాయి. శాంతి అన్న మాటలు చదివాక ఆలోచించాను. నిజంగా వాటిల్లోంచి నాకు లభించిన థ్రిల్ ఏమిటని.

నీలా, మావారిలా, శాంతిలా— ఏమీ లేదు అని ఇప్పటికీ అనను నేను.

వుందికాని క్షణికం అని ఇప్పటికి అర్థమైంది నాకు. కవ్‌బాయ్ సినిమాలు చూసినప్పటి థ్రిల్ లాంటిది. సినిమా హాల్లోంచి బయటికి రాగానే వాస్తవికత విసుగెత్తిస్తుంది. ఈ రెండు స్థితులకీ సమన్వయం కుదిరించుకోవాలన్న విషయం తెలియజేసింది శాంతి నాకు.

మా వారు నిజంగా మంచివారు. నా ఈ ప్రవర్తనకి విపరీతార్థాలు తీయలేదు.

ఇదీ మాలతీ జరిగిన కథ.

నేను చేసిన పని హర్షింపదగ్గది కాకపోయినా నేనెప్పుడూ ఇందుకు పశ్చాత్తాపపడను. పైగా యీ తప్పే నా జీవితానికి క్రొత్త చిగురులు తొడగబోతోంది. కాని ఆయనని క్షమార్పణ అడగను మాలతీ. ఎందుకో తెలుసా? నా అహం కొద్దీ కాదు. ఉన్నత స్థానంలో ఆయన హృదయంలో నిలచిన నా ప్రతిమని కేవలం బేలలా క్షమార్పణ చెప్పి క్రిందికి పడదోసుకోను. క్షమార్పణ కాదు కావలసింది. నాలో మార్పు. ఈ విషయం ఆయనకి నువ్వు చెప్పాల్సిన అవసరంలేదు. నిన్ను చూడటానికి వస్తారనుకుంటాను క్యాంప్‌లో తీరిక లభించినపుడు. బావగారికి నా నమస్కారాలు. తొందరగా ఉత్తరం వ్రాస్తావు కదూ?

—నీ రాధ."

ఉత్తరం చదివి కాసేపు అలానే నిలుచుండిపోయాను. నా హృదయం తేలికపడింది. రాధ దగ్గిరకు వెళ్లాలని వేగిరపడుతోంది. ఉత్తరం మాలతి కేసి విసరేసి బయటికి దారి తీశాను.

"మరదీ అన్నయ్య వచ్చేదాకా వుండవా?"

"ఇప్పుడు కాదు. మరొకప్పుడు...."

వేగంగా పరిగెత్తాను. సూట్‌కేస్ సర్దాలి. రైలు టైంకి చేరుకోవాలి. నిర్మలమైన రాధ మొహంలోకి చూస్తూ ఆమె మృదు హస్తాలని నా కళ్ల కద్దుకోవాలి.

మరింత వడిగా ముందుకు దూసుక పోయాను! ●

# సంగీత ప్రధాన చిత్రం సంగీతలక్ష్మి



'సంగీతలక్ష్మి'లో జమున

సమీక్ష:

అపార్థాలు, అనుమానాలు మొదలైన వాటితో ప్రమేయం లేకుండా ప్రతిపాత్రనూ మంచితనంతో ముంచెత్తి రూపొందించిన కథను సీతా రామాంజనేయ పిక్చర్స్‌వారు 'సంగీతలక్ష్మి'గా నిర్మించారు.

అయిదు సంవత్సరాలపాటు రష్యాలో శిక్షణ పొందివచ్చిన శ్రీ గిడుతూరి సూర్యం ఈ చిత్రానికి కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం నిర్వహించారు.

మదరాసులో జరిగిన సంగీత పోటీలో వేణుకి, రాధకి పోటీ జరుగుతుంది. న్యాయ నిర్ణేతలు వేణుకి బహుమతిని యిస్తారు. కానీ రాధ కూడా తనతో సమంగా పాడిందనే ఉద్దేశ్యంతో ఆ బహుమతిని రాధకిస్తాడు వేణు. రాధ కల్నల్ కొండలరావు కూతురు. కొండలరావు మేనల్లుడు ఆనందం నళిని అనే నాట్యగత్తెను ప్రేమిస్తాడు. కొండలరావు రాధను తనకిచ్చి చేయాలనుకుంటున్న సంగతివిని రాధ వేణుల పరిచయానికి, తద్వారా ప్రేమకి అవకాశం కలిగిస్తాడు. కొండలరావు ప్రమేయం లేకుండా రాధ వివాహం జరుగుతుంది. తాను వేణులో ఉన్న కళకోసం సర్వస్వాన్ని త్యజించి వచ్చానని, పుట్టింటివారి సొమ్ము తానొక్క చిల్లిగవ్వ కూడా ముట్టుకోననీ ప్రమాణంచేసి చెప్తుంది రాధ వేణుతో. పరిస్థితులు దిగజారటంతో వేణు తన భార్యమాటను కాదని నళిని బృందంతో విదేశాలకు వెళ్తానంటాడు. ధనార్జనకి పనికిరాని విద్య వృధా అనే నిర్ణయానికొచ్చిన వేణు ప్రయత్నాన్ని ఆపాలని ఎంతో ప్రయత్నిస్తుంది రాధ. వేణు వెళ్లిపోతాడు— రాధని, నాలుగేళ్ల కూతురు లక్ష్మిని వదలి. కూతుర్ని పుట్టింట్లో తండ్రి బలవంతం మీద వదలి రాధ గురుదేవులవద్దకు సంగీతశాస్త్రంలో యింకా సాధన చేయుడానికి వెళ్తుంది. తల్లి హైద్రాబాదులో ఉందన్న సంగతివిని లక్ష్మి యింట్లోనుంచిపారిపోయి మరొక సంగీత విద్వాంసుని యింటికి చేరుతుంది. నళినితో పేచీపడ్డ వేణు తిరిగి వస్తుండగా ఓడ ప్రమాదం సంభవిస్తుంది. బ్రతికి బయటపడ్డ వేణు అవిటివాడవుతాడు. తిరిగి తిరిగి స్వస్థలానికి చేరిన వేణును ఎనిమిదేళ్ల లత పాట ముగ్ధుడిని చేస్తుంది. దేశ దేశాల సంగీతాన్ని ప్రాచ్య సంగీతంతో మేళవించి కొత్త ప్రయోగం చేయాలనుకున్న వేణుకు లత శిష్యురాలవుతుంది. లతద్వారా తన కృషి ఫలిస్తుందని ఆశిస్తాడు వేణు. తర్వాత కొద్ది రోజులకు లత తన కూతురు లక్ష్మి అని తెలిసినా తానెవరో మాత్రం కుమార్తెకు తెలీనివ్వకుండా జాగ్రత్తపడి సంగీతశాస్త్రంలో తనకి తెలిసినదంతా లతకు నేర్పుతాడు వేణు. రాధకు లతకు పోటీ జరుగుతుంది—సంగీత సరస్వతి బిరుదు ప్రదానానికి. పోటీలో అంతా కలుసుకోడంతో కథ సుఖాంతమవుతుంది.

ఈచిత్రంలో ఎన్. టి. రామారావు, ఎస్. వి. రంగారావు, నాగభూషణం, రమణారెడ్డి, రాజ్ బాబు, ఏడిద నాగేశ్వరరావు, జమున, సూర్యకాంతం, ఎల్. విజయలక్ష్మి, బేబి శాంతికళ మొదలగువారు నటించారు.

వేణుగా ఎన్. టి. రామారావు, రాధగా జమున, కల్నల్ కొండలరావుగా ఎస్. వి. రంగారావుల నటన చిత్రానికిజీవం పోసింది. ఆనందంగా నాగభూషణం నటనలో కొత్తదనం కన్పించింది. రాజ్ బాబు, రమణారెడ్డి, సూర్యకాంతం హాస్యం ప్రేక్షకుల్ని గిలిగింతలు పెడుతుంది. ఎల్. విజయలక్ష్మి శాస్త్రీయ నృత్యాలు, ఎస్. రాజేశ్వరరావు శాస్త్రీయ సంగీతం సంగీత నృత్య కళాభిమానులకు విందు చేస్తాయి. దర్శకత్వం ప్రతిభావంతంగా ఉందనటంలో అత్యుక్తిలేదు. ఈ చిత్రానికి నిర్మాతలు: పి. నరసింగరావు, అమరా రామసుబ్బారావు.

—మాధవ్

## ముఖ్య ప్రకటన

రూపాయ **విలువ** తగ్గింపు వలన పత్రికలకు యేర్పడిన అదిక వ్యయముల భారమును కొంతవరకు సర్దుబాటు చేసికొనుటకై ఇండియన్ ఈస్టర్న్ న్యూస్ పేపరు సొసైటీ వారు, తమ సభ్యులైన న్యూస్ పేపర్లన్నింటిలో ప్రకటింపబడు ప్రకటనలపై **1966 ఆగస్టు 1 వ తేదీనుండి 10 పర్సెంట్ సర్ ఛార్జి విధింపవలసినదిగా** ఆదేశించియున్నారు.

ఆంధ్ర దినపత్రిక, ఆంధ్ర సచిత్ర వారపత్రిక — యీ రెండున్ను పై సొసైటీ సభ్యులు గావున, ఆంధ్ర దినపత్రికలో **1—8—66**వ తేదీనుండివెలువడు ప్రకటనలఛార్జీపైననూ, ఆంధ్ర సచిత్ర వారపత్రికలో **5—8—66** వ తేదీనుండి వెలువడు ప్రకటనల ఛార్జీపైననూ, సదరు సర్ ఛార్జి విధింపబడగలదని ఇందుమూలముగా ప్రకటనదార్లందరకు తెలియపర్చుకొనడమైనది.

**జనరల్ మేనేజరు.**

# చిత్రలహరి

జూలై 7 వ తేదీన శ్రీ ఆదుర్తి సుబ్బారావుగార్ని కలుసుకోవడం జరిగింది. నే వెళ్లేసరికి ఆయన హడావిడిగా ఎడిటింగ్ రూమ్‌లోకి వెళ్తున్నారు. నన్ను చూసి చిరునవ్వుతో పలుకరించారు. "బిజీయా సార్?" అన్నాను. "అవును సార్, ప్రస్తుతం బిజీయే. రేపు "కన్నె మనసులు" సెన్సారు జరుగబోతున్నది. మూడు, నాలుగు రోజుల్లో కబురుచేస్తాను వచ్చి చూద్దురు గాని" అన్నారు శ్రీఆదుర్తి. ఆయన కళ్లు నిద్రలేమిని సూచిస్తున్నవి. పట్టుదల, కార్యదీక్ష గల వ్యక్తుల్లో శ్రీ ఆదుర్తి ఒకరు. ఆయన ఎంత శ్రమ పడుతున్నా శ్రమిస్తున్నట్లు కనిపించరు. ఎప్పుడూ చలాకిగా నవ్వుతూ, ఉషారుగా వుంటూ సాటివారిలో ఉత్సాహాన్ని రేకెత్తిస్తారు. అందుకే ఆయన చిత్రాల్లో నటించాలని, ఆయనతో పనిచెయ్యాలని, నటీనటులు, సాంకేతిక నిపుణులు కుతూహలం కనబరుస్తారు.

కన్నె మనసులు తర్వాత విశాలనేత్రాలు రంగుల్లో నిర్మించడం నిజమేనా?

"ఫిల్మ్ లభ్యమయితే రంగుల్లోనే తీయాలని ఉంది."

"కలర్ ఫిల్మ్‌కి నిర్మాణవ్యయం కొంచెం అధిక మవుతుందేమో కదండీ?"

"అవును. నలుపు తెలుపుల్లోనిర్మించే చిత్రం కన్న ఐదు లక్షలు అదనంగా అవుతుంది. ఇది వరకు ఒక కలర్ప్రింటుకు పదివేలయ్యేది. ఇపుడు పదిహేను వేలకు పెరిగింది. రూపాయి విలువ పడిపోవడం వల్ల" అన్నారు శ్రీ ఆదుర్తి.

కన్నె మనసులు చిత్రం చాలా చక్కగా వచ్చిందనీ— మూగ మనసులు తర్వాత మళ్లీ అంతటి ఘనవిజయాన్ని యీ చిత్రం సాధించగలదనీ, ఈ చిత్రంలో గల మొత్తం తొమ్మిది పాటల్లోనూ కనీసం ఏడైనా పాపులర్ కాగలవనీ— రషెస్ చూసినవారు అభిప్రాయ పడుతున్నారు. తేనె మనసులు తారలతో గుమ్మడి, సూర్యకాంతం కలసి యిందులో నటించారు. ముళ్లపూడి వెంకటరమణ వ్రాసిన కథకు— కథకుడు, ప్రసిద్ధ నాటక రచయిత అయిన యువకుడు యన్.ఆర్. నంది సంభాషణలు సమకూర్చారు. సంగీతం: కె. వి. మహదేవన్, కెమేరా: పి. ఎల్. రాయ్, ఎడిటర్: కృష్ణ, దర్శకత్వం: ఆదుర్తి సుబ్బారావు నిర్మాత: సి. సుందరం. శ్రీ ఫిలిమ్స్‌ద్వారా యీ చిత్రం జూలై మధ్య భాగంలో ఆంధ్రలో విడుదల అవుతుంది.

* * *

అనంతలక్ష్మి ప్రొడక్షన్స్ వారి కార్యాలయంలో దర్శకుడు శ్రీ తిలక్‌ను కలుసుకున్నపుడు "మీ స్వంత చిత్ర నిర్మాణ కార్యకలాపాలేమయినా ఆరంభించారా?" అని అడుగగా "ఇంకాలేదు. ప్రస్తుతం స్క్రిప్టు పని జరుగుతున్నది. పినిసెట్టి వ్రాస్తున్నారు" అని చెప్పారు తిలక్. నాగేశ్వరరావు, జగ్గయ్య, జమున మొదలయిన ప్రసిద్ధ తారాగణం ఇందులో ఉండగలరని కథ: ఆరుద్ర, సంగీతం: పెండ్యాల నిర్వహించ గలరని కూడా వివరించారు.



"భూలోకంలో యమలోకం"లో రాజశ్రీ

ప్రస్తుతం శ్రీ తిలక్ "కాంభోజ రాజుకథ" చిత్రానికి దర్శకత్వం వహిస్తున్నారు. మొదటి షూటింగ్ షెడ్యూలులో ఒకసెట్‌మీద పనిపూర్తిచేశారు. తిరిగి రెండవ షెడ్యూలు యిపుడు ఆరంభించారు.

* * *

తేనెమనసులు తారలు— రామ్మోహన్, కృష్ణ, సుకన్య, సంధ్యారాణి, దర్శకుడు ఆదుర్తి, సి. సుందరం (బాబూమూవీస్) గార్లను జూలై 3 వ తేదీన నెల్లూరు ఫిలింఫాన్స్ అసోసియేషన్‌వారు సన్మానించారు. సభకు శ్రీ బెజవాడ గోపాలరెడ్డి అధ్యక్షత వహించారు.

## లేతమనసులు

"హలో మేడమ్, కారుముందు కూచుని తపస్సు చేస్తున్నారు" అంటూ వ్యంగ్యంగా అడిగాడు శేఖర్. భామ చిన్నబుచ్చుకుంది.

"ఏం చెయ్యమంటారు? మర్యాద తెలియని మనుషుల్ని కార్లో ఎక్కించానని, కారుకి కోపం వచ్చింది. ఆగిపోయింది"అన్నది.



శ్రీధర్ హిందీ చిత్రం 'ప్యార్‌కియాజా'లో రాజశ్రీ, కల్పన, శశికపూర్



'అమ్రపాలి' హిందీచిత్రంలో వైజయంతీమాల

"ఓహో, అలాగా సరే! యిప్పుడు టైమ్ ఎనిమిది. ఇక్కడనుంచి సిటీకి పది మైళ్ళు. ట్రైన్, బస్, ఆటోరిక్షా— ఏమీ దొరకదు. బస్సుగూడ రెండునాళ్ళకు ఒకసారి....వస్తా.....టా....టా....బై, బై... ఛీర్ యూ" అంటూ ముందుకి కదల బోయాడు.

భామకు ఒక చక్కటి ఆలోచన వచ్చింది. అతని వెనుకనేవస్తూ, "ఏమండీ, ఏమండీ!" అని పిలిచింది. "ఏమిటండీ!" వెనుదిరి గాడు. "ఇలా ఒక ఆడపిల్లని ఒంటరిగా వదిలేసివెళ్ళడం న్యాయమేనా?" అడిగింది దీనంగా భామ.

"కారుందిగా తోడు!"

"అది కదలనంటుందే!"

"అది బాగా ఉన్నపుడు చెడిపోయిందని అబద్ధమాడారు. ఆ అబద్ధమే ఇప్పుడు నిజమయింది."

"ఇంకెప్పుడూ అబద్ధమాడనండీ. ఇప్పుడు ఎలాగండీ యింటికిచేరడం?" ఆమె మోహంలో దిగులూ, ఆత్రుతా తొంగి చూస్తున్నవి.

"ఏముంది, రండి. యిద్దరం కులాసాగా, హాయిగా నడిచిపోదాం" అన్నాడు. భామ గతుక్కుమని "అమ్మో పదిమైళ్ళు నడవడమే?" అన్నది. "అయితే యిద్దరం యిక్కడే వుండిపోదాం" తీర్మానించాడుశేఖర్. "ఆ! రాత్రంతా మీతో......యిక్కడ ఒంటరిగానా?" సందేహం వెలిబుచ్చింది. "పోనీ మీరుండండి. నేను పోతాను" అన్నాడు కాస్త చిరాగ్గా. "వద్దండీ, వద్దండీ! నాకు ఒక్కదానికీ భయం!" బ్రతిమాలుతూ అడిగింది. "బాగుంది వరస! పోదాం అంటే వద్దంటారు. వుందాం అంటే కాదంటారు. ఎలా మరి?"

భామ కేదో యోచన తట్టినట్లు "ఆ! ఒక పని చేద్దాం. నేను కారు వెనక సీట్లో పడుకుంటాను. మీరు ముందు సీట్లో పడుకోండి!" అన్నది మొహం ఇంత చేసుకొని. అమ్మాయిగారి ఆలోచన అబ్బాయికి నచ్చలేదు. "ఇంపాసిబుల్, మీది జాన బెత్తెడుకారు. నేను ఆరడుగుల మనిషిని. అందులో ముడుచుకుని పడుకోవడం నావల్ల కాదు. అదుగో హంసతూలికాతల్పం! గడ్డివామి......దానిమీద హాయిగా పడుకుంటా. మీరు కారులో పడుకోండి!" అంటూ అటుకేసి నడిచాడు. అనతిదూరంలోనేవున్న అమ్మవారి చలవచూసి భయంతో శేఖర్ దగ్గరికి పరుగుపెడుతూ, "శేఖర్, శేఖర్!" పిలిచింది భామ. "ఏమిటండీ, ఏమిటలా గజగజలాడుతున్నారు" అడిగాడు. ఆమె కంగారు దేనికో అర్థంగాక. "అక్కడ ఎవరో అమ్మవారు నాలుక వెళ్ళబెట్టి నావంక గుడ్లు రిమిచూస్తోంది" అన్నది ఆమె భయంగా.

"అక్కడ అమ్మవారికే అంత భయపడితే ఇక్కడ అయ్యవారు ఏం తక్కువవాడా?" భామను క్రీగంటచూస్తూ అడిగాడు.

"ఏమిటండీ వేళాకోళం? నేను యిక్కడే పడుకొంటాను" అన్నది ధైర్యం తెచ్చుకుంటూ. "సరే పడుకోండి!" అంటూ తన పక్కనున్నచోటు చూపాడు శేఖర్.

"మీ పక్కనా?"

"పోనీ ఆ పక్కన పడుకోండి!"

"ఉహూ!" అన్నది చిలిపిగా. "అయితే మీయిష్టం!" అని పడుకున్నా డతను. "సరే నేను యిటుతిరిగి పడుకుంటాను. మీరు అటుతిరిగి పడుకోండి" అన్నది సమాధానానికివస్తూ.

ఇద్దరూ చెరోవేపు పడుకున్నారు. శేఖర్ చెయ్యివచ్చి భామమీద వాలింది. చివాలున ఆమె ఇటు తిరిగి "చూశారా, మీ చెయ్యి వచ్చి నామీద పడుతూంది. దానికి కాస్త బుద్ధి చెప్పండి" అన్నది.

"ఆ చెప్పేబుద్ధి మీ చేతికే చెప్పండి!"

"ఏమన్నారు?"

—కట్ అన్నారు దర్శకులు. యువ హృదయాలను రంజింపజేసే యీ సన్నివేశం ఏ. వి. యం. వారి "లేత మనసులు" చిత్రంలోనిది. భామ, శేఖర్‌లుగా జమున, హరనాథ్ యిందులో పాల్గొన్నారు. సంభాషణలు: డి. వి. నరసరాజు రూపొందించారు. గీతాలు: దాశరథి, ఆరుద్ర. సంగీతం: ఎమ్. ఎస్. విశ్వనాథం, కళ: ఏ. కె. శేఖర్, కెమెరా: ఏ. విన్సెంట్, దర్శకత్వం: కృష్ణన్—పంజు.

## శ్రీ రామా ఆర్ట్స్

శ్రీ రామా ఆర్ట్స్ అనే నూతన చిత్ర



"భూలోకంలో యమలోకం"లో కాంతారావు, రాజశ్రీ

నిర్మాణసంస్థ ఒక సాంఘికచిత్రం నిర్మించే సన్నాహాలలో ఉన్నది. యన్. టి. రామారావు, పద్మనాభం, దేవిక, గీతాంజలి, వాణిశ్రీ మొదలయినవారు నటిస్తారు. కథ: రాజశ్రీ. సంగీతం: కోదండపాణి, దర్శకత్వం: జి. వి. ఆర్. శేషగిరిరావు, నిర్మాత: జి. వి. రామ

## చిత్రలహరి

చంద్రరావు. ప్రస్తుతం స్క్రిప్టు పని జరుగుతున్నది. సెప్టెంబరునుంచి సెట్సు మీదకు వెళ్లనున్నారు.

—మోహన్ కుమార్







## విభిన్న కళాస్వరూపాలలో అభ్యున్నతిని సాధించిన నేర్లెక్ష వేణుమాధవ్

ఏక పాత్రాభినయం, బహు పాత్రాభినయం, మిమిక్రీ ధ్వన్యనుకరణ, వెంట్రిలాక్విజం ఆదిగాగల విభిన్న కళా స్వరూపాలలో స్వయం కృషితో అభ్యున్నతిని సాధించి ఒక్క ఆంధ్రదేశంలోనే కాకుండా, దేశంలో పలుచోట్ల ప్రదర్శనలిచ్చి ప్రేక్షకుల ప్రశంశలనందుకున్నారు శ్రీ వేణుమాధవ్.

వరంగల్లు వాస్తవ్యులైన వీరు బాల్యం నుంచీ నాటకాలలో పాల్గొని చిన్న వయస్సులోనే జీవితాన్ని కళకి అంకితం చేశారు. శ్రీ వేణుమాధవ్ ఉస్మానియా విశ్వవిద్యాలయంనుంచి పట్టభద్రులయారు.



వేణుమాధవ్, ప్రశంసిస్తున్న రాజ్ కపూర్

తెలుగు, హిందీ, ఆంగ్లం, ఉర్దూ, భాషలలో ఆయనకు మంచి పరిచయం ఉంది. ఈయన వయస్సు 32 సంవత్సరాలు.

బహు పాత్రాభినయంతో శ్రీ వేణుమాధవ్ దిట్ట. అనేక ఇంగ్లీషు, తెలుగు నాటకాలలోని పాత్రలను అతి సహజంగా సంభాషణలతో ఏకకాలంలో నటించగలరు.

విభిన్న వ్యక్తుల మనస్తత్వాలు, అలవాట్లు, రూపురేఖా విలాసాలను అనుకరించి ప్రేక్షకుల్ని నవ్వించటం మిమిక్రీ. ఉపాధ్యాయుల బోధనా రీతులను, వీధులలో వివిధ వ్యక్తులు నడచేతీరు, ఫొటోలో కూచున్న పెక్కుమంది రూపురేఖావిలాసాలు, భంగిమలను అతి సహజంగా కళ్లకు కట్టినట్లు చెయ్యటంలో శ్రీ వేణుమాధవ్ అందెవేసిన చెయ్యి.

మహా నాయకులను, మహా నటీ నటులను, రచయితలను వారి వారి కంఠస్వరాలలో అనుకరించటంలో శ్రీ వేణుమాధవ్ విశేష కృషి చేశారు. ఎందరో నాయకులు నటీ నటులు రచయితలు ఈయన ప్రదర్శనచూసి ముగ్ధులై ప్రశంసించడమే కాకుండా ఈయన ప్రతిభకు ఆశ్చర్యపోయారుకూడా.

విదేశాల్లో బహుళ ప్రచారంగల కళ వెంట్రిలాక్విజం. శ్రీ వేణుమాధవ్ మొట్టమొదటసారిగా దీన్ని ఆంధ్రదేశంలో ప్రవేశపెట్టారు. నేపథ్య సంగీతంగా దూరంనుంచి వినిపిస్తున్న గుర్రపు డెక్కల చప్పుడు, ఫిడేలు, ట్రంపెట్, విజిల్, క్లారినెట్ ధ్వనులను మేళవిస్తూ ఘట్టాల్ని అభినయించడం ఈ కళలోని ప్రత్యేకత. ప్రేక్షకులు స్టేజివైపు చూడకుండా కూర్చుని దాన్ని వింటుంటే నిజంగా ఒక సినిమా చూస్తున్నట్లే అన్పిస్తుంది.

శ్రీ వేణుమాధవ్ ప్రతిభా విశేషాలని పత్రికలు ప్రముఖంగా ప్రచురించాయి. ఇటీవల ఆంధ్రప్రభుత్వం సాంస్కృతిక ప్రతినిధిగా భోపాల్, రాయపూర్, భిలాయ్, బిలాస్‌పూర్, కాన్పూర్, లక్నోలలో ప్రదర్శనలిచ్చి కీర్తి నార్జించారు. కోరాడ నృత్యబృందంతో భారత్ చైనా సరిహద్దులలో మన సైనికులకు వినోద ప్రదర్శనలిచ్చి వారి ప్రశంసలనందుకున్నారు.

శ్రీ వేణుమాధవ్‌ని రాష్ట్రేతర ఆంధ్ర సంఘాలు ఎన్నో ఘనంగా సన్మానించాయి. కోయంబత్తూర్, హైదరాబాద్, నల్గొండ, వరంగల్ పట్టణాల్లో బంగారు పతాకాలను బహూకరించారు. ఆయన స్వస్థలంలో శ్రీ నీలం సంజీవరెడ్డి అధ్యక్షతన పౌర సన్మానం జరిగింది. ఆయన చదువుకున్న స్కూల్‌లో శ్రీ వేణుమాధవ్‌కు 'ధ్వన్యనుకరణ చక్రవర్తి' అనే బిరుదును యిచ్చారు.

ఇంకా యితర చోట్లలో 'ధ్వన్యనుకరణ పారీణ,' 'ధ్వన్యనుకరణసామ్రాట్' 'కళాప్రవీణ' బిరుదుల నందుకున్నారు యువ కళాకారులైన శ్రీ నేరెళ్ల వేణుమాధవ్.

—ఎం. ఆర్.

**అవీ-ఇవీ...**

## దుర్గాపూర్ ఆంధ్ర సమితి

దుర్గాపూర్ ఆంధ్రసమితివారు యిటీవల నాట్యతార కుమారి ఎల్. విజయలక్ష్మి భరత నాట్య ప్రదర్శనను ఏర్పాటు చేశారు. దుర్గాపూర్‌లోని 'బి' జోన్ కమ్యూనిటీ సెంటర్ హాలులో జరిగిన ఈ ప్రదర్శనను ప్రధాన అతిథిగా దుర్గాపూర్ స్టీల్ ప్లాంట్ జనరల్ మేనేజర్ విచ్చేశారు. ప్రదర్శనకు ఆంధ్రులు, ఆంధ్రేతరులు ఉన్నతాధికారులు రష్యన్లు, జపాన్‌వారు, ఆంగ్లేయులు విచ్చేశారు. ఈ సమితివారు రెండు సంవత్సరాల క్రితం కుమారి యామినీ కృష్ణమూర్తి నాట్య ప్రదర్శనను ఏర్పాటు చేశారు. సమితి అధ్యక్షులు శ్రీ కె. అప్పారావు ప్రసంగించిన అనంతరం కన్వీనర్ శ్రీ పి. సర్వేశ్వరరావు వందన సమర్పణ చేశారు.



తప్పక చూడండి!
ఉషా ఫిలిమ్స్
సమర్పించు
దైవశాసనం
పాతూరి సుబ్బారావు
P. సత్యనారాయణ
దర్శకత్వం.... ఏ.పి.నాగరాజన్. మాటలు-పాటలు.. శ్రీశ్రీ. సంగీతం.... పామర్తి



# నటి కాంచన

"ప్రేమించి చూడు" చిత్రం ద్వారా ఆంధ్రులందరికీ పరిచితురాలయిన కుమారి కాంచనకు యివాళ చలన చిత్ర పరిశ్రమలో అగ్రస్థానం ఉన్నది ఆచిత్రంలో ఆడే పాడే అందాల అమ్మాయిగా కనిపించింది. వీరాభిమన్యు, ఆత్మగౌరవం చిత్రాలు ఆమె చక్కని నటి అని నిరూపించినవి.

"రంభా వూర్వశి తలదన్నే రమణీలలామ ఎవరీమె?"— వీరాభిమన్యు చూసిన వారికి యీపాట గుర్తుండేవుంటుంది. తొలిచూపుల పారవశ్యంలో అభిమన్యుడు ఉత్తరనుద్దేశించి పాడుతూంటే, ఆ వేషంలో వున్న కాంచన నిజంగా ఉత్తరేమో నన్నంత చక్కగా భావప్రకటన చేసింది. పొంగుతున్న ప్రేమ వాహినిలో, ముంచెత్తే సిగ్గుతెరల్లో ముగ్ధమోహనగా కాంచన ఆ సన్నివేశంలో నటించిన తీరు మరపుకురానిది.

"ఆత్మగౌరవం" చిత్రంలో ఆమె పోషించిన పాత్ర బరువయినది. ప్రణయ సన్నివేశాలలో ఎంతో హుందాగా నటించడమేగాక, విషాదఘట్టాలను సయితం నేర్పుతో పోషించి ఆవేశాన్ని రక్తి కట్టించింది. సంభాషణలు చెప్పేవిధానం కూడ చక్కగాఉంది. ప్రతిభగల నటీనటులు ఎక్కడున్నా గుర్తించ బడుతారు.

కాంచన యివాళ నాగేశ్వరరావు, రామారావులవంటి అగ్రశ్రేణి నాయకులపక్కన నటించగలుగుతోందంటే — నటిగా ఆమెకిగల ప్రజ్ఞాప్రాభవాలే అందుకు తార్కాణం, దర్శకుల సూచనలు, సలహాలు పాటిస్తూ, సన్నివేశాన్ని అర్థంచేసుకుని — నటించే పాత్రకు న్యాయం చేకూర్చేందుకు యత్నిస్తుంది కాంచన.

### జన్మస్థలం

కాంచన జన్మించింది విజయవాడలో. అయినా, పెరిగిందీ, చదువుకున్నదీ మద్రాసు నగరంలో. ఇక్కడ పెరిగినంత మాత్రాన యీ అమ్మాయిది అరవతెలుగేమో ననుకుంటే అపార్థం చేసుకున్నట్లు అవుతుంది. తెలుగు సాహిత్యంతో కాంచనకుగల పరిచయం అపారమయినది. ఆమె రీడింగ్ రూమ్ పరిశీలిస్తే—ఆమెతో సంభాషిస్తే తెలుగు సారస్వతంతో ఆమెకుగల పరిచయం ఎలాంటిదో అర్థమవుతుంది.

### నిర్మాణంలోఉన్న చిత్రాల్లో

ఇపుడామె రవీంద్ర ఆర్ట్ ప్రొడక్షన్స్ వారి "డాక్టర్ ఆనంద్", చిన్నీ బ్రదర్స్ వారి "సతీసుమతి", హృషికేశ్ పిక్చర్స్ వారి "అందంకోసంపందెం", "వీరపూజ", ప్రవీణా ఆర్ట్‌పిక్చర్స్ వారి చిత్రాల్లోను నటిస్తున్నది. ఈ తెలుగు చిత్రాలు కాక ఆర్. ఆర్. పిక్చర్స్ వర్ణచిత్రం, కవి కరుణానిధి చిత్రం, పట్సు ఫిలిమ్స్, కె. బాలచందర్ దర్శకత్వంలో తయారయే చిత్రం— మొదలయిన తమిళచిత్రాలలో కూడా పాల్గొంటున్నది. ఇటీవల ఆమె నటించిన "తేడివంద తిరుమగల్" తమిళ చిత్రం విజయవంతంగా సాగుతున్నట్లు వార్తలు వస్తున్నవి.

ఇంతవరకు కాంచన నటించి విడుదలయిన చిత్రాల్లో తమిళం ఆరూ, తెలుగు మూడూ వున్నవి. తీరిక వేళల్లో గార్డెనింగూ, పుస్తక పఠనం, అభిమానుల ఉత్తరాలను పరిశీలించి వాటికి జవాబులు వ్రాయడం ఆమెకి సరదాలు.

### ఇష్టమైన భూమికలు

విశాలమయిన ఫాలభాగం, నిశితంగా పరిశీలిస్తున్నట్లుండే పెద్ద పెద్దకన్నులు, కొనదేలిన నాసిక, చిరునవ్వు లాస్యంచేసే పెదవులు— కాంచన అందగత్తె అని చెబుతవి.

"ఏ తరహా పాత్రలు పోషించ డానికి మీరు ఎక్కువ యిష్ట పడతారు?" అన్న ప్రశ్నకు కాంచన సమాధానంచెబుతూ "అన్ని రకాల భూమికలూ పోషించాలని వుంటుంది. అన్నీ చేయగలనా అంటే చెప్పలేను. చేస్తేకదా తెలిసేది, ఏపాత్రలో ఎంతవరకూ సఫలీకృతురాలినయ్యాను అని... నేను రస్టిక్ టైపుకుచెందిన వేషాలు పోషించడమంటే ఎక్కువ మక్కువ చూపుతాను." అన్నది.

"డాక్టర్ ఆనంద్' చిత్రంలో ఆమె నటించిన పాత్ర చక్కనిది. దీని అనంతరం కాంచన ప్రతిభావంతురాలయిన నటి అని మరోసారి రుజువవుతుందనడంలో ఆశ్చర్యపడాల్సిందేమీలేదు.

—మోహన్ కుమార్.



ముత్యాలవంటి

తెల్లని పలువరస...
సులభమైన డెంటానిక్
పద్ధతి ద్వారా మీరు
అందమైన తెల్లని దంత
ములను ఆరోగ్య
కరమైన చిగుళ్ళను
పొందగలరు.

పౌడర్, మరియు
క్లోరోఫిల్‌తో లభించును.

బెంగాల్ కెమికల్స్

డెంటానిక్

ఆంటీసెప్టిక్ టూత్ పౌడర్

కలకత్త * బొంబాయి * కాన్పూర్ * ఢిల్లీ




## సలహా

కోల్పోయిన ఆనందం, బలం, శక్తిని తిరిగి యిచ్చేందుకు ఆహ్లాదకరమైనది. నరాల బలంకు పైపూతకు వాడే తైలం. 1 సీసా రు 11-50 స్పెషల్ రకం అర్జంటు గుణంకు రు. 27/- ఎడ్వాన్సు పంపుతూ జవాబుకు కవరు పంపాలి.

డాక్టర్ రత్నం సన్స్,
Sex Specialists (Estd 1904)
ఆజంపురా మార్కెట్ వద్ద, మలకపేట బిల్డింగ్
హైదరాబాద్-36 (ఆంధ్రప్రదేశ్)






KESAVARDHINI

నిగనిగలాడు నల్లని నిడుపాటి
అందమైన కేశములకు

కేశవర్ధిని

ఆదర్శమైన హేర్ ఆయిల్




కేశవర్ధిని షాంపు

ఉపయోగించి మీ కురులను
శుభ్రముగా, సువాసనగా ఉంచండి

కేశవర్ధిని ప్రొడక్ట్స్,
మద్రాసు-14.

Edited Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6&7 Thambu chetty Street Madras-1. Phones Editorial. 21747; Other depts; 29766. Chief Editor; S Sambhu Prasad.